# బొమ్మరిల్లు

(హెన్రిక్ ఇబ్సను నుండి)

# బొమ్మరిల్లు.

(హెన్రిక్ ఇబ్సను నుండి)



దేశరాజు రామదాసుగారిచే అనువదింపబడి

ప్రకటింపఁబడియె.



కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1936.



[వెల 0-12-0.

# అంకితము.

ఎవతె నా గ్రంథమును చూచినంతనే యపరి
మితానంద పరవశురాలయ్యెడిదో, ఎవతె నా గ్రంథ
మును చూచిన నెల్లలోకమును చూచినట్లే నే నా
నంద మందెడివాడనో, ఎవతె నా యుత్సాహమును
సంతతాభివృద్ధి గావించుచుండెడిదో, ఎవతెకు నే నీ
గ్రంథమును జ్ఞాప- ప్రయాణమయ్యెను, చూప
జాలకపోయితినో అట్టి నా యనుంగు సోదరియగు
"గురజాడ వెంకటరమణమ్మ" కు
అనురాగపూర్వకముగానంకితముగావించుచున్నాను.

దే॥ రా॥

# పాత్రలు.

టోర్వాల్డు హెల్మర్.

నోరా—అతని భార్య.

డాక్టరు రాంక్.

లిండీ దేవి.

నిల్సుక్రోగ్ స్టాడ్.

హెల్మరుగారి ముగ్గురు పిల్లలు.

ఏనీ—వారిదాది.

ఒక దాసి.

ఒక కూలివాడు.

# పీఠిక.

ఆంధ్రవాఙ్మయము సర్వతోముఖాభివృద్ధి కావలెనంటే స్వతంత్రరచనలే కాక ప్రపంచమునందలి సమస్తభాషలయందలి ఉత్తమగ్రంథములను మూలానుసారముగా నాంధ్రీకరించుట యు నత్యావశ్యకమేయని నాయాశయము. పాశ్చాత్యభాషల నుండి యనువదించినప్పుడు ఇంగ్లీషుభాషాసాహాయ్యమపే క్షించుటయు దోషముకాదని నాయూహ. ఈ నాయాశయా ముల కనుకూలముగా "పెలియాజ్ - మెలిజాండాలు" "బొమ్మ రిలు" "సిలిపిట్ట" అను గ్రంథములు వాటియనువాదములైన ఇంగ్లీషుభాషాగ్రంథములనుండి నేను తిరిగీ తెనుగుభాషను పరివర్తనము గావించినాను. నాకు గలిగిన ఆర్థికదుఃస్థితి, దాని మూలమున గలిగిన నిరుత్సాహములచే మరికొన్నిగ్రంథముల నీరీతిగా ఆంధ్రీకరింపదలచియు వెనుకంజ వేసితిని. 1928 సం॥లో నాచే తెలుగింపబడిన పెలియాజ్ - మెలిజాండాలు 1931 సం॥ భారతియందు ప్రకటింపబడినది. 1930 సం॥లో తెలుగింపబడిన యీ "బొమ్మరిల్లు" నేటికి పుస్తకరూపమును దాల్చుచున్నది. 1931 సం॥లో తెలుగింపబడిన "సిలిపిట్ట" ఇంక నెన్నిసంవత్సర ములు వేచియుండవలెనో !

ఆంధ్రవాఙ్మయము గత పదిహేనుసంవత్సరములకంటె నిప్పుడెంతో యభివృద్ధిచెందుచున్నమాట నిశ్చయము. ఈ గ్రంథములయొక్క మంచిచెడ్డలను నిర్ణయించుటకు [illegible]

పుస్తకపఠనమెంతో యభివృద్ధి చెందవలసియున్నది. రచింపబడిన యెల్లగ్రంథములు మంచివనిగాని చెడ్డవనిగాని చెప్పవలనుపడదు. మంచిగ్రంథము నభినందించుటకును, చెడ్డగ్రంథమును నిందించుటకునైనను గ్రంథపఠన మత్యావశ్యముగదా !

తెనుగుభాష నారాధించుటకు ఉడతాభక్తియని నేను ఈ యత్నమునకు దొడంగితిని. నా యీప్రయత్నమెంతవరకు ఫలించినదో ! నాయీగ్రంథమున ముద్రాక్షరాదిదోషములు కొన్నిగలవు. ఈ పుస్తకము పునర్ముద్రణముగాంచు భాగ్యమెన్నటికైనగలుగుచో భాషావేదులసహాయముచే నాలోపములన్నియు సవరింపగలనని వినయపూర్వకముగా విన్నవించుచున్నాను.

ఈగ్రంథమును మూలముతో చాలవరకు సరిచూచి, ఎన్నోతీరని వ్యాపకములున్నను, "అవతారిక" రచించిన మ. రా. శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారికి నా కృతజ్ఞతావందనములు. దీని ముద్రణమునకై కొంతవరకు ద్రవ్యసహాయము చేసిన మ.రా.శ్రీ డోల ఎర్రన్నాయుడు, మ.రా.శ్రీ డోల అప్పలనాయుడుగార్లకు నే నెంతయు కృతజ్ఞుడను. వారి విద్యాభిమానమును, ఆయురైశ్వర్యములను భగవంతుడు సదా పెంపొందించుగాక.

గొల్లలవల్స,
12-5-36.

ఇట్లు,
దేశరాజు రామదాసు.

# అవతారిక.

నార్వే దేశపుభాషలో హెన్రిక్ ఇబ్సెన్ మహాకవి రచించిన ఒకనాటకమునకు ఆంగ్లభాషానువాదముగా ఉన్న A Doll's House కు ఈ 'బొమ్మరిల్లు' అనే నాటిక శ్రీయుత దేశరాజు రామదాసుపంతులు తెలుగుభాషలో పరివర్తనముచేసి ప్రకటిస్తున్నాడు. అనువాదమునకు అనువాదముగా ఉన్న ఈచిన్ననాటిక మనుమరాలివంటిది. ఈ మనుమరాలు తన అమ్మమ్మను ఎంతవరకు పోలిఉన్నదో, ఆ అమ్మమ్మ రూపమునకు భిన్నమైన రూపమును ఎంతవరకు దాల్చియున్నదో ఈమూడుభాషలతోను పరిచయము గలవారే చెప్పగలరు. తరములు మారినకొలదీ మొదటిరూపము అంతకంతకు ఎక్కువగా మారిపోతూ ఉండడము సహజమే. అయినా, అమ్మమ్మరూపురేఖావిలాసములు కొన్ని కూతురిలో లోపించి మనుమరాలిలో కనబడుతూఉండడము అసంభవముకాదు. ఆవిధముగానే ఆంగ్లభాషానువాదమైన A Doll's House అనే నాటికలో కనబడుటకు వీలులేని సొగసులు ఆంధ్రభాషానువాదమైన బొమ్మరిల్లు అనేనాటికలో కొన్ని గోచరించినవి. అందుకు దృష్టాంతముగా రెండు స్థలములందలి వాక్యములు చూపిస్తున్నాను. ఈ కథకు నాయిక అయిన నోరా తన్నుచూడవచ్చిన క్రిస్టైనీ

లిండీదేవిని పోల్చుకోలేక పోయినది. ఈవిషయము తెలుగు భాషలో ఎంతచక్కగా సూచింపబడినదో చూడండి.

లిండీదేవి—నోరా! ఖులాసాగా నున్నావా ?

నోరా—(సందేహముతో) మీరు ఖులాసాగా—

లిండీదేవి—నువ్వు నన్ను పోల్చుకోలేదనుకొంటాను.

నోరా—లేదు. పోల్చుకోలేదు—ఆఁ. జ్ఞాపకము వచ్చింది. (తొందరగా) అవును. నువ్వు క్రిస్టెనీవికావూ ?

చిన్నప్పుడు తనతో కలసి చనువుకొని జట్టుగా ఉండిన నోరా తన్నెప్పుడు "మీరు" అని అన్నదో, అప్పుడే ఆమె తన్ను పోల్చుకోలేదని లిండీదేవి అనుమానించుటకు అవకాశ మేర్పడినది. తెలుగుభాషలో 'నీవు' 'మీరు' ఔచితిని బట్టి వాడుటవల్ల కలిగే సొగసు Thou కు మారుగాపైతము You వాడుటవల్ల నేటి ఆంగ్లభాషలో కనబరచుటకు అవకాశము లేదు.

మరియొక దృష్టాంతము :

తనకు చిన్ననాటి మిత్రుడయిన క్రోగ్‌స్టాడ్ వర్తమాన కాలమందు తనచేతిక్రింద చిన్నపదవిలో ఉండినన్ని తన కచేరి లో నలుగురి యెదుటను అధికారియెడలను చూపించవలసిన గౌరవము చూపించక పూర్వపరిచయమున్న చనవున్ను మర్యా

నియోగము చేస్తూ వ్యవహరిస్తున్నాడని హెల్మరు ఎట్లు తెలియజేసినాడో చూడండి.

" నలుగురు ఉన్నప్పుడైనా ఒకపిసరు కట్టుదిట్టముగా నుండడు. అదిగాక నాతో చనవుగా మాట్లాడడాని కొక హక్కున్నదని ప్రతీక్షణం ' ఒరే హెల్మరు ' అని యిలాగ్గా పిలుస్తాడు. "

ఆంగ్లభాషలో Mr. విడిచిపెట్టడంవల్ల ఈ అర్థవిశేషము కొంతవరకు గోచర మవుతుందిగాని, 'ఒరే హెల్మరు' అనడమువల్ల అయినంత స్పష్టముగా కాదు.

ఇటువంటిస్థలములలో ఇబ్ సెన్ రచనకు ఆంగ్లభాషాను వాదముకంటె ఆంధ్రభాషానువాదమే ఎక్కువచేరువగా ఉండు నని చెప్పవచ్చును. అయితే, అంతమాత్రాన 'A Doll's House' కంటె అందుకు అనువాదముగా ఉన్న 'బొమ్మరిల్లు' మిన్నయని నేను చెప్పడములేదు. సర్వాంగసంపన్నమై సర్వతోముఖమైన విద్యావ్యాసంగముచేతను సకలవిధములయిన రచనలచేతను చాలాకాలమును పరిష్కృతమై ప్రౌఢమైయున్న ఆంగ్లభాషలో సంపూర్ణాభ్యాసముగల ఒక ఆంగ్లపండితుడు అనువాదముచేసిన 'A Doll's House' ఎక్కడ! సంస్కృత భాషాసాహాయ్యము లేనియెడల చెల్లుబడిగల పదములు దొరకక చిక్కుపడుతూ గద్యరచనాభ్యాసము ఇంకా ప్రారంభదశ

లో ఉండుటవల్ల ముగ్ధగా ఉన్న తెలుగుభాషలో మా రామదాసుపంతులువంటి నూత్నరచయిత అనువాదముచేసిన 'బొమ్మరిల్లు' ఎక్కడ !

స్వతంత్రించి నాటకములు రచించేవారిప్రతిభ, ప్రజ్ఞావిశేషములు కేవలము భాషాంతరీకరణముమాత్రమే చేసిన వారిలో కనబడుటకు అవకాశముండదు. అయితే, కొన్ని విషయములలో మాత్రము స్వతంత్రించి గ్రంథము రచించుటకంటె పరభాషలో ఉన్నగ్రంథము స్వభాషలోనికి పరివర్తనముచేయుట ఎక్కువకష్టమైన పని. కంటికింపుగా ఉండే ఊహాకల్పితమైన స్త్రీని చిత్రించుటకంటె వికృతరూపమున ఉన్న ఒక ముష్టిదాని చిత్రముగాని అందముగా ఉన్న ఒక స్త్రీచిత్రముగాని ఉన్నది ఉన్నట్లుగా రచించుట ఎక్కువకష్టమైన పని. మూలమునకు ఏ మాత్రము భిన్నముగా ఉన్నా ఆక్షేపణీయమే. అనువాదము చేసేవారికి స్వాతంత్ర్యము ఏమీ ఉండదు. మూలములో ఉన్న రసపుష్టి, అర్థసౌష్ఠవము, పదలాలిత్యము మొదలయిన లక్షణాములన్నీ అనువాదములో కనబడవలెను. ఈఆశయములను బట్టి పరిశీలించగా 'A Doll's House' కు అనువాదముగా ఉన్న 'బొమ్మరిల్లు' మొత్తముమీద మెచ్చుకోదగినట్లు రచితమైనదని చెప్పవచ్చును. ఉద్దిష్టభావములు సరిగా వ్యక్తపరచుటలోను, వాక్యరచనలోను అక్కడక్కడ కొన్నిలోపము లుంటే ఉండవచ్చును; గాని, మొత్తముమీద అనువాదమువల్ల కలుగక

తప్పని లోపములు సాధ్యమయినంతవరకు కలుగనీయకుండా భాష సరళముగాను తెలుగుపలుకుబడికి అనుగుణముగాను పాత్రోచితముగాను సాగించి విద్యార్థులున్ను విద్యాధికులున్ను చదివి ఆనందించుటకు అనుకూల మైనట్లుగా రామదాసుపంతులు ఈ గ్రంథము తెలుగించినాడని చెప్పవచ్చును.

ఈ సందర్భమున మూలగ్రంథమును రచించిన హెన్రిక్ ఇబ్సెన్ మహాకవినిగురించి కొద్దిగానైనా చెప్పకుండుట ధర్మముకాదు.

ఈ మహానుభావుడు 20-3-1828 వ తేదీని నార్వే దేశమున స్కీయెన్ పట్టణమున పుట్టెను. చిన్నతనమునుండిన్ని ఇతనికి కళలయందు ఆసక్తి మెండుగా ఉండెను. స్వల్పవిషయములైనా ఎక్కువగాను మనోహరముగాను వర్ణించుటయందు ఇతనికి గొప్ప నేర్పు సహజముగా అలవడినది. బాల్యావస్థలో విద్యార్థిగా ఉన్నప్పుడే ఇతడు తన కలలో చూచినది ఎంతో హృద్యముగా వర్ణిస్తూ వ్రాసి తనతోడి విద్యార్థులకు చదివి వినిపించినాడట! ఇతడు కొద్దిగా పద్యకావ్యములను అనేకముగా నాటకములను రచించి జగద్విఖ్యాతిపొందిన మహాకవి. వాటిని యూరపుఖండమందలి పలుదేశములవారు తమ తమ భాషలలోనికి పరివర్తనము చేసుకొన్నారు. 1877 లో ఇతనికి స్వీడన్ దేశమందలి ఉప్సలా విశ్వవిద్యాలయమువారు గౌరవా

ర్థముగా Doctor of Philosophy అనే బిరుదము ఇచ్చినారు. ఈగౌరవము పొందిన మరిరెండుసంవత్సరములకే ఇతడు 'ఈబొమ్మరిల్లు' నాటకమును రచించెను. ఇతడు తననాటకములలోని పాత్రములను కేవలము భావకల్పితముల వలెగాక వాస్తవముగా జీవించి యున్నవ్యక్తులవలెనే భావించి వారితో తనకెంతో పరిచయముగలిగి వారిశీలము, రూపము, స్వభావము మొదలయిన గుణములన్నీ వారి అంతరంగికరహస్యములతో కూడా యెరిగినవానివలె చిత్రించినాడు. ఒకసారి అతని మిత్రుడొకడు "ఈ బొమ్మరిల్లునాటికలోని నాయికకు 'నోరా' అనేపేరు ఎట్లువచ్చినది?" అని అడిగినప్పుడు, "నీకు తెలియదా? ఆమెపేరు వాస్తవముగా 'లియోనోర్.' అయితే ఆమెను ఇంటివారందరూ 'నోరా' అని ముద్దుపేరు పెట్టి పిలుస్తూ ఉండడముచేత 'నోరా' అనే పేరు వచ్చినది." అని ఎంతో నిబ్బరముగా చెప్పినాడట!

ఈ నాటికలోని కథ చిన్నదైనా మానవజీవితమును విమర్శించుటకు అవకాశములు అనేకముగా ఇందులో గలవు. స్థూలదృష్టికి మంచిగా కనబడే గుణములు సూక్ష్మదృష్టికి చెడ్డగాను, స్థూలదృష్టికి చెడ్డగా కనబడే గుణములు సూక్ష్మదృష్టికి మంచిగాను గోచరించేటట్లు కథనడపించి పాత్రపోషణముచేయుటలో ఇబ్సెను గట్టివాడు. ఈనాటికకు కథానాయకుడైన హెల్మరు అనేకసద్గుణములు గలవాడే. భార్యను

ప్రేమించి ఆమె ముద్దుముచ్చటలు తీరుస్తూ ఆదరించినవాడే. కాని ఆమె తనయెడలగల గాఢమైన ప్రేమతోనే చేసిన తెలి వితక్కువపనివల్ల తన గౌరవానికి భంగంకలుగుతుందన్న భయము తోచగానే ఆమెను తన శత్రువువలెనే భావించి కడు నీచముగా నిందించి, ఆ భయము పోగానే ఆమెను మంచి మాటలతో ఓదార్చుటకు మొదలుపెట్టినాడు. నోరా దస్తా వేజు కాగితములో దొంగసంతకముచేయడము తన భర్తప్రాణ ములు కాపాడుటకే అయినా తప్పే. అయితే ఆకాగితము క్రోగ్‌స్టాడ్ తనవద్దనుంచుకొని అది నలుగురికీ చూపించి తన గౌరవమునకు భంగం కలుగజేస్తాడన్న భయమువల్ల నోరాచే సినతప్పు కడు ఘోరముగాను, క్రోగ్‌స్టాడ్ ఆకాగితము తనవ ద్దకు పంపించివేయగానే ఆభయము పోవుటవల్ల ఆతప్పు మర చిపోదగినదిగాను, భావించి, మొదటను ఆమెను కడునీచము గా నిందించిననోటనే తుదకు మంచిమాటలాడి ఆశ్వాసించు టలో హెల్మరు తనస్వార్థపరత్వమునే చూచుకొన్నాడుగాని నోరా చెప్పినట్లు భారమంతా తనమీదనే వేసుకొని ఈతప్పం తా నాది అనలేదు. ఈవిషయము నోరా యెత్తిపొడిచినప్పుడు "ప్రపంచంలో ఎవరును తాను ప్రేమించినదాని కూర్చి తనగౌర వాన్ని భంగంచేసుకోరు అనికూడా అతడు తనస్వార్థపరత్వం వ్యక్తంచేసుకొన్నాడు. అప్పుడు నోరా "ఆలాగు లక్షలకొలదీ స్త్రీలుచేస్తారు" అని స్త్రీల ఆధిక్యం తెలియజేసినది. లోకం

లో హెల్మెరు వలెనే పెక్కుమంది తలిదండ్రులు తమపిల్లల
ప్పడైనా గాజువస్తువుడంటివి ప్రమాదవశమున నేలపైజారవిడిచి
ప్పుడు అది బద్దలైతే క్షమింపరాని పెద్దనేరముగా ఎంచి తమ
పిల్లలను దండించడమున్ను అది బద్దలుకాకుంటే, అదిచిన్నత
ప్పుగా ఎంచి కొద్దిగా మాత్రమే చీవాట్లుపెట్టడమున్ను అంద
రికిని తెలిసినవిషయము. బద్దలుకావడముగాని కాకపోవడము
గాని కేవలము దైవాధీనము; దానివల్ల పిల్లలుచేసినతప్పు
ఎక్కువకాదు. తక్కువకాదు.

నోరా తనభర్తను ప్రేమించుటలో స్వార్థపరత్వమున
త్యజించినది; గాని తనయెడల తనభర్తకు తనఆశయముల కను
కూలమైన ప్రేమ లేదనిన్ని అందువల్ల తనను నీచముగా చూచి
నాడనిన్ని తెలుసుకొన్నతర్వాత అతనితో మరి కాపురముచే
యుటకు ఇష్టపడని మానిని. నాయికానాయకుల గుణములు
కథారంభమున కనబడినవాటికి విపరీతముగా కథాంతమున పరి
ణమించినవి ఈతెలుగునాటికలో ఈ పాత్రపోషణము రసవంత
ముగా సాగిన దని చెప్పవలెను.

నాటిక అంతా మొత్తముమీాద స్వతంత్రించి రచించిన
దానివలెనే సరళముగాను శ్రావ్యముగాను ఉన్నది. రసజ్ఞులు
న్ను, కళానిపుణులున్ను దీనిని అభినయించి ఆనందింతురుగాక!

విద్యార్థికులు దీనిని ఆదరించి ఈగ్రంథకర్త ఇట్టి అనువాదములు ఇంకా చేసేటట్లు ప్రోత్సహింతురు గాక!

పర్లాకిమిడి
6-5-1936

గిడుగు వేంకటసీతాపతి,
బి. ఏ., ఎల్. టి..

# బొమ్మరిల్లు.

## ప్రథమాంకము.

---

### రంగము.

[ఒకగది. అమితమైన పరికరములు లేనప్పటికీ, యింపుగాను సహాయముగాను నుండును. వెనుకతట్టు కుడివైపునుండి సావడిలోని కొకద్వారముండును. ఎడమవైపుననున్న మరియొక ద్వారము హెల్మరుగదిలోని కుండును. రెండుద్వారములకును మధ్యనొక పియానో. ఎడమవైపుననున్న గోడను మధ్యనొక ద్వారము. దానిప్రక్క నొకకిటికీ, కిటికీవద్ద గుండ్రనిమేజాబల్ల, చేతులుగలకుర్చీలు, ఒకసోఫా. కుడివైపుననున్నగోడకు, ఒక కొనను మరియొకద్వారము. ఆవైపుననే దానిప్రక్కనొకస్టవ్వు. రెండు వాలుకుర్చీలు. ఒక ఉయ్యాలకుర్చీ. ద్వారమునకు స్టవ్వునకు మధ్య నొకచిన్నమేజా. గోడలపై చిత్తరువులు. పింగాణి చిప్పలు మొదలగువస్తువులుగల ఒకగూడు. అందముగా నట్టకట్ట బడిన పుస్తకములుగల ఒకబీరువా. నేలను తివాసీ పరిచి యుండును. స్టవ్వు వెలుగుచుండును. అది శీతాకాలము. సావడిలో గంటమ్రోగును. కొంతసేపైనతరువాత తలుపుతెరచినట్టు శబ్దము వినబడును.]

[ప్రవేశము:—నోరా, సంతోషముతో తనలోతా కూనురాగము తీసుకుంటూ, ఆమె వీధిలోనికిపోవు దుస్తుల నుండి ఏవో కొన్ని పట్టుకొని వచ్చును. వానిని కుడివైపునను మేజాపై పెట్టును. ఆమె వచ్చినపిదప వీధిద్వారముతీసి తెర యుంచును. దానిగుండా నొకకూలివాడు ఒకగంపను, క్రి మస్ చెట్టును పట్టుకొనివచ్చును. దానినివాడు తలుపు తెర దాసీ కందించును.]

నోరా—క్రిష్టమస్ వృక్షాన్ని జాగ్రత్తగాదాచు హె న్! ఈసాయంత్రందాకా పిల్లలకుమాత్రం కనబడకుం చూడు. అప్పుడు దాన్ని అలంకరిద్దాం. (సొమ్ముసంచీతీసి కూ వానితో) ఎంత?

కూలివాడు—ఆరుపెన్సులు.

నోరా—ఇదిగో షిల్లింగువద్దు. చిల్లరక్కర్లేదు తీసు (కూలివాడు ఆమెకు నమస్కరించును. నోరా తలుపుమూ వేయును. తనకోటు టోపీ విప్పుచు తనలోతాను నవ్వుకొ చుండును. తనజేబునుండి బిస్కత్తులపొట్లాముతీసి ఒకటిరెం తినును. పిదప నెమ్మదిగా తనభర్తగదిద్వారమువద్దకుపో వినును.) అదిగో లోపలేయున్నారు. (కూనురాగముతీస్తూ కు వైపు మేజావద్దకు పోవును.)

హెల్మరు—(తనగదిలోనుండి పిలుస్తూ) ఆకిలకిల్ల చున్నది నాభరతపక్షేనా?

నోరా—(కట్టలు విప్పుచు) అవును.

హెల్మరు—ఆచప్పుడు చేస్తున్నది నావ్రుడతేనా ?

నోరా—ఆఁ.

హెల్మరు—నాచిన్నివ్రుడత యింటికెప్పుడు వచ్చింది?

నోరా—ఇప్పుడే. (బిస్కత్తులసంచీ తనజేబులో పెట్టు కొని తనమూతి తుడుచుకొనును.) లోపలికి రండి. నే నేం తె చ్చానో చూద్దురుగాని.

హెల్మరు—నన్నల్లరపెట్టకు. (కొంతసేపైనతరువాత తలుపుతెరచి చేతకలముపట్టుకొని గదిలోనికి తొంగిచూచును.) ఏమిటి? కొన్నానన్నావా? ఇవన్నినా ? నాముద్దుల ఖర్చు దారి తిరిగీ సొమ్ము దండుగపెడుతున్నాదా ?

నోరా—అవును. కాని ప్రియా ! ఈసంవత్సరం మనం కొంచెము ఖర్చుపెట్టుకోవచ్చునుగదా. మనం గడుపుకోనవస రంలేకుండా వుండడానికిదే మొదటిసంవత్సరం.

హెల్మరు—అయినప్పటికి మన మీలాగు కాతరులేకుం డా ఖర్చుపెడితే యేలాగు?

నోరా—నిజమేగాని మనంకొంచెం దురావరిగా నుండ వచ్చును. ఏం నాధా! ఉండకూడదూ? ఒక్కపిసరు. మీను పెద్ద జీతం కాడానికి సిద్ధంగానుంది. దోసిళ్ల కొద్దీ గడిస్తారు.

హెల్మరు—అవును. అది కొత్తసంవత్సరం వెళ్లినతరు వాతకాని మనకు జీతంవచ్చేసర్కి పూర్తిగా మూడు మాసాలు పడుతుంది.

నోరా—అప్పటివరకూ యెక్కడో అప్పుచేసుకుందాం.

హెల్మరు—(నోరా ఆమెదగ్గరకుపోయి వినోదంగా చెవిపట్టుకొని) అదిగో నాముగ్ధ. ఇప్పుడు నేను యాభైపౌను లు అప్పుచేశాననుకో. ఈకిసిమిసికి నువ్వదంతా ఖర్చుపెట్టేశా వనుకో. కొత్తసంవత్సరాది రేపనగా నాతలమీద బల్లపడి నేను చచ్చిపోతే—

నోరా—(తనచేతులతో అతనినోరుమూసి) పోనిత్తురు. అటువంటివాగాయత్తపుమాటలాడకండి.

హెల్మరు—పోనీ. ఆలాగు జరిగిందనుకో—అప్పుడేమి టి చేస్తావు ?

నోరా—ఆలాగు జరిగినట్టయితే బాకీలేదు. గీకీలేదు, ఆసంగతే నేను తలపెట్టను.

హెల్మరు—సరే. అప్పిచ్చినవాళ్ల గతేమిటి ?

నోరా—వాళ్లసంగతా? వాళ్లనుగురించి యెవరు తల మొత్తుకుంటారు? వాళ్లెవరో నేనెవరో ?

హెల్మరు—ఆడవాళ్లు చెప్పవలసినమాట చెప్పావు. కాని నోరా ! నిశ్చయంగా నాపుద్దేశమేమిటో తెలిసిందా ? అప్పులేదు. అప్పుచెయ్యడంలేదు. అప్పుచేసుకొని తింటూ

వున్న యింట్లో హాయిగాని స్వతంత్రముగాని వుండదు. ఇప్పటి దాకా మనం సరియైనదారిలో వచ్చాము. మరికొద్దికాలం మన మీదారిలోనే వెళ్లామంటె మనకేమి యిబ్బందుండదు.

నోరా—(స్టవ్వుతట్టు జరుగుతూ) మీయిష్టమే.

హెల్మరు—(ఆమె ననుసరిస్తూ) రా, రా, నాభరత పక్షి రెక్కలు ముడుచుకోకూడదు. ఇదేమిటి నాచిన్నివుడతకు కోపంవచ్చిందా యేమిటి ? (సొమ్ముసంచీతీసి) నోరా ! ఇందు లో నేమిటుంది ?

నోరా—(వెంటనే వెనక్కు తిరిగి) సొమ్ము.

హెల్మరు—సరీగా చెప్పావు. (ఆమెకు కొంతసొమ్మి చ్చును.) క్రిస్టమస్‌లో ఇంటిఖర్చు కెంతకావాలో నాకు తెలి యదనుకున్నావా ?

నోరా—(లెక్కపెడుతూ) పదిషిల్లింగులు- ఒకపౌను- రెండుపౌనులు ! నమస్కారము నాథా ! ఇది చాలకాలము వరకు చాలును.

హెల్మరు—సరిపెట్టుకోవాలి.

నోరా—అవునవును. చాలును. కాని యిలారండి. నే నేంతెచ్చానో చూపిస్తాను. ఎంతోచవగ్గాను. ఇదిగో ఇవారు నకు ఒకకోటు, పంట్లాము, ఒకకత్తి; బాబుకి ఒకతాపాబండి, గుర్రం; ఎమ్మీకి ఒకబొమ్మ, బొమ్మలమంచం, అవి చాలా బాగున్నాయి. కాని వాటినది ఒకదెబ్బలోనే విరిచేస్తుంది.

ఇవిగో దాసీలకు చేతిరుమాళ్లు బట్టకొ_త్తులు. ఏనీ కేదై నా
మంచిదివ్వాలి.

హెల్మరు—ఆపొట్లామేమిటి ?

నోరా—(అరుస్తూ) వద్దువద్దు. సాయంత్రందాక దాన్ని
మీరు చూడవద్దు.

హెల్మరు—సరే. కాని నాఖర్చుదారి కేమిటికావాలో
చెప్పు.

నోరా—నాకా? నా కేమిటివద్దు.

హెల్మరు—కాని నువ్వేమైనా పుచ్చుకోవాలి. సవ్య
మైనదీ, నీకు ముఖ్యంగా నిష్టమైందీచెప్పు.
నోరా—నా కేం తట్టకుండావుంది. మీరే—

హెల్మరు—ఏమిటి ?

నోరా—(అతని కోటుగుండీలతో నాడుతూ తలవంచు
కొని యతనివైపు చూడనైనా చూడకుండా) మీరే నా కేదై
నా నిశ్చయంగా నివ్వాలంటే యివ్వొచ్చు—ఇవ్వండి.

హెల్మరు—అదేదో చెప్పు ?

నోరా—(తొందరగా నంటుకొని) మీరు డబ్బివ్వొ
చ్చు. ఎంతివ్వగలిగితే అంతే. ఆతరువాత యిలాంటిపండుగు
రోజుల్లో నాకు తోచింది అదిపెట్టి కొనుక్కుంటాను.

హెల్మరు—కాని నోరా !—

నోరా—అలాగు చెయ్యండినాథా! అలాగుచెయ్యండి. నేను దాన్ని అందమైన ముచ్చికాగితంలో చుట్టి క్రిస్టమస్ చెట్టునకు వ్రేలగడతాను. బాగుండదూ?

హెల్మరు—సొమ్ము వృథాగా ఖర్చుపెట్టుతున్నవాళ్లనేమంటారు?

నోరా—దూబరగొట్టువాళ్లంటారు. నాకు తెలుసును. మీకెలాగు బాగుంటుందని తోస్తే అలాగుచెయ్యండి. నాకేమిటికావాలో ఆలోచించుకోడానికి నాకు వ్యవధికూడా వుంటుంది. ఆమార్గం బాగు లేదూ? ఏమంటారు?

హెల్మరు—(నవ్వుతూ) అవు నదిమంచిదే. అంటే నేనిచ్చినసొమ్ము నువ్వు మిగిల్చి అదిపెట్టి యేదైనా కొంటే. కాని దాన్నంతానువ్వు ఇంటికిందే ఖర్చుపెట్టేసి, అనవసరమైన వస్తువులు కొనేస్తే—అప్పుడు తిరిగీ నేను దాన్నంతా తీర్చుకోవాలి.

నోరా—కాని అలాగెందు కవుతుంది నాథా—

హెల్మరు—నేనన్నది కాదనడానికి వీలులేదు నోరా. (తనచేతితో నామెకటిప్రదేశమును చుట్టుతూ) అది నాముద్దుల ఖర్చుదారేగాని యెంతో డబ్బుఖర్చుచేస్తుంది. అటువంటివాళ్లెంత ఖర్చుపెడతారో యెవరికీ తెలియదు.

నోరా—మీరలాఅంటే నాకు సిగ్గువేస్తుంది. నేను నిజంగా మిగల్చగలిగినంత మిగులుస్తున్నాను.

హెల్మరు—(నవ్వుతూ) అది నిజమే-నువ్వు మిగల్చగలిగినంత—కాని నువ్వేమీ మిగల్చలేవు. అందువల్ల యేమీ మిగలదు.

నోరా—(సంతోషముతో మందహాసము చేస్తూ) ఈ భరతపక్షులకు, ఈవుడతలకు ఎంతఖర్చులుంటాయో మీకేం తెలుసును!

హెల్మరు—నువ్వింకా పూర్వకాలపుమనిషివి, మీనాన్నలాంటి దానవే. నాదగ్గరనుండి సొమ్ము లాగడానికి నువ్వేదో మార్గం కనిపెడుతూవుంటావు. సొమ్ము చేతికొచ్చినతరువాత అదినీచేతిలో మంచులాగ కరిగిపోతుంది. అదియెక్కడకు వెళ్లిపోతుందో నీకు మరితెలియదు. అయినప్పటికీ నీమాటకెవరూ వ్యతిరేకం చెప్పకూడదు. అవునిదంతా నీకు మీతండ్రినుండి వచ్చిన గుణమేకదూ!

నోరా— మా తండ్రివద్దనుండి నాకు మరికొన్నిగుణాలేమైనావస్తే బాగుండును.

హెల్మరు—నాభరతపక్షిలో నాకేమీ మార్పక్కరలేదు. ఇప్పుడెలాగుందో అలాగుంటేచాలు. కాని నువ్విప్పుడస్వస్థతగా నున్నట్టు నాకు కనిపిస్తున్నాది.

నోరా—అస్వస్థతగా నున్నట్టు కనబడుతున్నానా?

హెల్మరు—నిశ్చయంగాను. నాతట్టుచూడు.

నోరా—(అతనివైపు చూచును) ఏమిటి?

హెల్మరు—(ఆమెవైపు వ్రేలాడిస్తూ) స్వీట్‌టూత్ మిమ్మల్నందర్నీ చెరిపేస్తున్నాది.

నోరా—లేదు. మీకెందుకలాగు తోచింది ?

హెల్మరు—ఇవాళ బిస్కత్తులదుకాణానికి వెళ్లలేదు ?

నోరా—లేదు నాథా.

హెల్మరు—అప్పుడప్పుడు మిఠాయి కొనుక్కొని తింటూవుండడం లేదు?

నోరా—లేదు.

హెల్మరు—ఒకబిస్కత్తయినా కొరికిచూడడంలేదా ?

నోరా—లేదునాథా. నేను నిశ్చయంగా చెప్తాను.

హెల్మరు—అబ్బే. నే నుట్టి నవ్వులాలకన్నాను.

నోరా—(కుడివైపునుండి మేజావద్దకుపోయి) మీకోరికకు వ్యతిరేకంగా నే నెప్పుడూ చెయ్యను.

హెల్మరు—అవును. చెయ్యవు నాకు తెలుసును. అదిగాక చెయ్యనని నువ్వు మాటకూడా యిచ్చావు. (ఆమెవద్దకు వెళ్లి) క్రిస్టమస్ రహస్యాలన్నీ నీవద్దనే వుంచుకో, రాత్రి క్రిస్టమస్‌వృక్షాన్ని వెలిగించేటప్పుడే అందరికీ తెలుస్తాయి.

నోరా—డాక్టరు రాంక్‌గారిని పిలవాలన్నమాట జ్ఞాపకముందా ?

హెల్మరు—లేదు. అది అవసరంలేదు. మామూలుప్రకారంగానే అతఁడు మనతో భోజనానికి వస్తాడు. అయినప్పు

టికీ వుదయం వచ్చేటప్పుడు చెప్తాను. నేను మంచి ద్రాక్షరసం కోసం పంపించాను. నోరా! పొద్దెప్పుడు పోతుందాఅని నేనెంత తొందరపడుతున్నానో నీకు తెలియదు.

నోరా — నేనుకూడాను. పిల్లలెంత ఆనందంపొందుతారో నాథా ?

హెల్మరు — పెద్దవుద్యోగము౯ కావలసినంత డబ్బువస్తున్నప్పుడు దానినిగూర్చి తలచుకోవడం హాయిగానుంటుంది. అది తలచుకుంటే మిక్కిలి సంతోషంగానుండదూ ?

నోరా — చాల సంతోషంగా నుంటుంది.

హెల్మరు — గతక్రిస్టమస్ నీకు జ్ఞాపకముందా ? క్రిస్టమస్‌కు ముందు పూర్తిగా మూడువారాలు నువ్వు గదిలో తలుపువేసుకొని చాలరాత్రివరకు క్రిస్టమస్ చెట్టును అలంకరిస్తూ కూర్చున్నావు. ఎన్నెన్నో వింత ఆభరణాలుపెట్టి మమ్మానద్భుతపరచడానికి. ఆమూడువారాలు నాకు మిక్కిలి చికాకుగా నుండేది.

నోరా — నాకుమాత్రం చికాకు వెయ్యడంలేదు.

హెల్మరు — (మందహాసంచేస్తూ) కాని దానికి అమూల్యమైన పర్యవసానం కలిగింది.

నోరా — దాన్నిగూర్చి నన్ను మరివేళాకోళం చెయ్యకండి. పిల్లివెళ్లి చింపేస్తే నన్నేమిటి చెయ్యమన్నారు ?

హెల్మరు—అవు నది నిజమే. నువ్వేంచేస్తావు నాచి న్నారి. మమ్మలను సంతోషపెట్టాలని నీకు చాలవుండేది. కాని మన కిప్పుడాకష్టకాలమంతా గడిచిపోయింది.

నోరా—అవునది నిశ్చయముగా నద్భుతమే.

హెల్మరు—ఈసారి నేను చికాకుతో నొంటరిగా కూర్చోవలసిన అవసరం లేదు. నువ్వు నీసుందరమైన కళ్లు, మృదువైన చేతులు పాడుచేసుకో నక్కరలేదు.

నోరా—(చప్పట్లు చరుస్తూ) అవసరంలేదు. నాథా! అవసరంలేదు. ఇంకా అవసరముందా? మీరామాటలు చెప్తూవుంటే నాకు చెవులపండుగ్గానుంది. (అతని చేయిపట్టుకొని) మనసామాను ఎలాగు సర్దుతే బాగుంటుందని నాకు తోస్తున్నాదో అదిమీకు చెప్తాను. క్రిస్టమస్ అయిపోయినతరువాత (సావడిలో గంటమ్రోగును) అదిగో గంటవాగుతున్నాది. (గదికొంచెము సర్దును) ఎవరో తలుపువద్దనున్నారు. ఏంవెధవ ఘోష.

హెల్మరు—నాకోసంగాని యెవరైనావస్తే నే నింటివద్ద లేనని చెప్పు.

దాసి—(ద్వారంలో) అమ్మా! మీకోసం ఎవరో ఆడమనిషి వచ్చింది. క్రొత్తమనిషి.

నోరా—ఆమెను లోపలికి రమ్మను.

దాసి—(హెల్మరుతో) మీకోసం డాక్టరుగారుగూడా యిప్పుడే వచ్చారు.

హెల్మరు—తిన్నగా నాగదిలోకే వెళ్లిపోయేడా ?

దాసి—అవును బాబు!

(హెల్మరు తనగదిలోనికి పోవును. ప్రయాణపుదుస్తుల లోనున్న లిండీదేవిని దాసి లోనికి తోడ్కొనివచ్చి తలుపు మూయును.)

లిండీదేవి—(నిరుత్సాహ కరమైన పిరికి స్వరముతో), నోరా ! ఖులాసాగా నున్నావా ?

నోరా—(సందేహముతో) మీరు ఖులాసాగా—

లిండీదేవి—నువ్వు నన్ను పోల్చుకోలేదనుకుంటాను.

నోరా—లేదు. పోల్చుకో లేను—ఆఁ. జ్ఞాపకము వచ్చింది. (త్వరగా) అవును. నువ్వు క్రిస్టైనీవికావూ ? –

లిండీదేవి—అవును.

నోరా—క్రిస్టైనీ! నేను నిన్ను పోల్చుకోలేకపోవడం— అవును. నేనెలాగుపోల్చుకోవడం—(సరళస్వరముతో) నువ్వెం తమారిపోయావు ?

లిండీదేవి—అవును. నేను చాల మారిపోయాను. ఈ తొమ్మిది పదిసంవత్సరాలయి—

నోరా—మనం కలుసుకొని అన్నాళ్లైందా ? అయిం దనుకుంటాను. ఈయెనిమిది పదిసంవత్సరాలు నాకు ఖులాసా

గానే వుంది. అయితే యిప్పుడు నువ్వుపట్నంలోనే కొచ్చావు.
శీతకాలంలో దీర్ఘప్రయాణం చేస్తూ నన్నుచూడ్డానికి. నీద
యుందికాబట్టి.

లిండీదేవి——నేనివాళ ఉదయమే పడవదిగాను.

నోరా——కిసిమిసిరోజుల్లో ఖులాసాగా గడపడానికి ఎం
తానందం. మనంకలిసి నాలుగురోజు లానందంగా నుందాం.
కాని ఆబట్టలువిప్పి, నీకు చలిలేదుకాబోలు! (విప్పటలో సహా
యముచేయును.) మన మీస్టవ్వుప్రక్కను కూర్చుందాము.
హాయిగా నుంటుంది. లేదు. నువ్వీకుర్చీమీద కూర్చో. నే నీ
వుయ్యాలకుర్చీలో కూర్చుంటాను. (ఆమెచేతులు పట్టుకొని)
నువ్విప్పుడు తిరిగీ పూర్వపుమాదిరిగా కనబడుతున్నావు. అదం
తా మొదటిగడియే- క్రిసైనీ! నువ్వు కొంచెం పాలిపోయావు.
కొంచెం ఎండిపోయినట్టుగూడా కనిపిస్తుంది.

లిండీదేవి——మిక్కిలి ముసలితనం వచ్చినట్టుగూడాను
నోరా!

నోరా——బహుశా కొంచెం ముసలితనం వచ్చినట్టుకూడా
ను. కొంచెమే. విశేషంగాదు. ఎంతమాత్రంకాదు. (హటాత్తు
గా నూరుకొని నిదానంగా మాట్లాడును.) నేనెంత తెలివిమా
లినదానిని, నేనుకాలమంతా మాటలతో వృధాపుచ్చుచున్నా
ను. నాప్రియురాలా! క్రిసైనీ! నన్ను క్షమించు.

లిండీదేవి—నోరా! నువ్వన్నమాట నాకు బోధపడ లేదు.

నోరా—(నెమ్మదిగా) అయ్యో! చెల్లెలా! నువ్వు అనాథవుగదా!

లిండీదేవి—అవును. నాభర్తపోయి మూడుసంవత్సరములైంది.

నోరా—అవును. నాకు తెలుసును. నేను పత్రికలలో చూశాను. నేను నిశ్చయంగా చెప్తాను. క్రిస్టైనీ! నీపేర ననేక సారులు ఉత్తరం వ్రాయాలనుకున్నాను. కాని యెప్పుడూ వ్రాద్దామనే గడిపేశాను. ఏకారణంచేతనో ఎప్పుడూ వ్రాయడమైందికాదు.

లిండీదేవి—నాకు బోధపడింది సఖీ.

నోరా—అది నామట్టుకు నాకే బాగులేదు. నువ్వు పాపం ఎంత బాధపడుతుండేదానివో. అతడు నీకేమీ ఆస్తివుంచలేదుగదూ?

లిండీదేవి—లేదు.

నోరా—ఏమీలేదు? అయితే?

లిండీదేవి—దుఃఖముగాని విచారముగాని కూడలేదు.

నోరా—(విచికిత్సతో నామెవైపుచూస్తూ) కాని, క్రిస్టైనీ! అలాగు జరుగుతుందా?

లిండీదేవి——(విచారముతో మందహాసముచేస్తూ నోరా తలను తనచేతితో దువ్వుతూ) ఒక్కొక్కప్పు డలాగు జరుగుతుంది నోరా!

నోరా——కాబట్టి నువ్వొక్కర్తెవే వున్నావు. అదెంత ఘోరవిచారమై యుంటుంది. నాకుముగ్గురు పిల్లలున్నారు. కాని వారిప్పు డింటివద్ద లేరు. దాదితో షికారు తిరగడానికిపోయారు. కాని యిప్పుడు నీసంగతంతా నువ్వు నాకు చెప్పాలి.

లిండీదేవి——ఆలాగుకాదు. నీసంగతే. నేను ముందు వినాలి.

నోరా——అలాగుకాదు. నువ్వు ముందుచెప్పాలి. నేడు నే నంతపెంకెత్తుగా నుండకూడదు. ఇవేళల్లా నీసంగతే నేను తెలుసుకోవాలి. కాని, నీకు చెప్పవలసినసంగతి ఒకటుంది. మా కిప్పుడే గొప్ప అదృష్టంపట్టింది. నీకు తెలుసునా?

లిండీదేవి——తెలియదు. ఏమిటది?

నోరా——ఊహించుకో! నాభర్తగారికి బాంకీమేనేజరు పనైంది.

లిండీదేవి——నీభర్తకా? ఎంతదదృష్టం.

నోరా——నిజంగానే. బారిష్టరుపనిలో రాబడికి నికరం లేదు. అందులో అన్యాయమని విచారిస్తే అసలే డబ్బులేదు. నాభర్తగారు అన్యాయమైనపక్షాన్ని యెంతమాత్రం అవలంబించరు. అది నాకూ యిష్టమే. ఇప్పుడు మాకెంతసంతోషంగా

నుందో నువ్వే ఊహించుకో. ఆయన ఈసంవత్సరాదినాఁడు పనిలో ప్రవేశిస్తారు. అప్పటినుండి ఆయనకు పెద్దజీతం. దోసిళ్ళ కొద్దీ రాబడి. ఇకముందు మే మిప్పటికంటే హాయిగా నుండ వచ్చును. మాయిష్టమువచ్చినట్టు మేము చెయ్యవచ్చును. నాకి ప్పు డెంతో చులాగ్గాను హాయిగానుఉంది. దోసిళ్ళకొద్దీ డబ్బు వచ్చి నిర్విచారంగానుంటే హాయిగా నుండదూ?

లిండీదేవి—అవును. ఎవరుకోరినది లభిస్తే వారి కదే సంతోషం.

నోరా—ఒక్క కోరిందేకాదు. దోసిళ్ళకొలదీ డబ్బు కూడాను.

లిండీదేవి—(దరహాసంచేస్తూ) నోరా! నోరా! నీకిప్పు డైనా జ్ఞానంవచ్చిందా? మనం చదువుకుంటున్నప్పుడు నువ్వు మిక్కిలి దుబారావరిగానుండే దానివి.

నోరా—(నవ్వుతూ) అవును. అదేయిప్పటికీ మావా రంటారు. (ఆమెవైపు వ్రేలాడిస్తూ) కాని, "నోరా, నువ్వ నుకున్నంత తెలివితక్కువదికాదు." మేము డబ్బు వృధాగా వ్యయంచేసేస్థితిలోలేము. మేమిద్దరముగూడా కష్టపడి పని చెయ్యవలసివుండేది.

లిండీదేవి—నువ్వుకూడానా?

నోరా—అవును విధీవిరామము లేదు. కుట్టుపని, అల్లిక, నగిషీ. (స్వరముతగ్గించి) ఇంకా అనేకపనులు. నాభర్త నా

పెండ్లైనతరువాత పనిమానీడం నీకు తెలుసునుగదా? ఉన్నత పదవి వెళ్ళడానికి మరేమి అవకాశంలేకపోయింది. అందుచే కష్టపడి ముందటికంటేకూడా హెచ్చుసంపాదించవలసివుండేది. కాని మొదటిసంవత్సరం అత్యధికంగా పనిచేశారు. ఎన్నివిధాల వీలైతే అన్నివిధాల డబ్బుగడించవలసివుండేది. వేకువనుండి చాలరాత్రివరకు పనిచేస్తూ వుండేవారు. అందుచే గొప్పజబ్బు పడిపోయారు. అప్పుడు వైద్యులు వారిజబ్బు కుదరడానికి దక్షిణదేశయాత్ర చెయ్యవలసివుంటుందని చెప్పారు.

లిండీదేవి—మవ్వాసంవత్సరమల్లా యిటలీదేశములోనే గదూ గడిపావు?

నోరా—అవును. కాని అదంతతేలికైనపని కాదని నేను చెప్పగలను. అది ఇవారు పుట్టినకొద్దిరోజుల్లోనే. కాని మేము వెళ్ళకతప్పనిసరి. అది మహాచక్కని ప్రయాణమే. నా భర్త ప్రాణాన్ని రక్షించింది. కాని గొప్పఖర్చైపోయింది.

లిండీదేవి—ఆలాగే అనుకున్నాను.

నోరా—ఆ ప్రయాణానికి రెండువందలయాభై పౌనులయినాయి. ఏం కొంచెంసొమ్మా?

లిండీదేవి—అవును. అటువంటి అవసరాల్లో అంత డబ్బుండడం చాల అదృష్టం.

నోరా—నీకు చెప్పాలిగదూ. అదంతా అప్పగారిచ్చారు.

లిండీదేవి—ఆలాగా? అతఁ డాసమయంలోనేగదూ మరణించినది.

నోరా—అవును. ఆలోచించు. ఆసమయంలో నేను వెళ్లి అతని కేమీ పరిచర్య చేయలేక పోయాను. అది నాకు పురిటిసమయం. చిన్నియివారు కడుపులోనున్నారు. వ్యాధిపీడితులైన నాభర్తగారే నాకన్నిసదుపాయములు చెయ్యవలసి వచ్చింది. నాప్రియజనకుని నేను మరిచూడ లేకపోయాను. క్రిస్టైనీ! నావివాహమైనప్పటినుండి అంతవిచారమైన కాలం మరొకటిలేదు.

లిండీదేవి—మీతండ్రిని నువ్వెంతప్రేమించేదానివో నాకు తెలుసును. ఆతరవాత నువ్వు ఇటలీ వెళ్లిపోయావా?

నోరా—అవును. మాచేతుల్లో డబ్బుండేది. వైద్యులు తప్పక వెళ్లవలసిందని చెప్పారు. అందుచే నొక నెలపోయిన తరువాత బయలుదేరాము.

లిండీదేవి—నీభర్త ఆరోగ్యవంతుడై వెళ్ళిపోవచ్చాడా?

నోరా—కంచుగంటలాగ!

లిండీదేవి—కాని - డాక్టరో?

నోరా—ఏడాక్టరు?

లిండీదేవి—నేనిక్కడికి వచ్చేముందర, ఎవరోడాక్టరు వచ్చారని దాసి చెప్పినట్టు జ్ఞాపకం?

నోరా—ఆతరువాత ?—

లిండీదేవి—అప్పుడు నాకు దొరికిందానిలో నేను ప్రవేశించవలసి వచ్చింది. మొదట ఒకదుకాణంలో ప్రవేశించాను. తరువాత నొక బడిలోను అలాగు అలాగు గడచిన మూడుసంవత్సరాలు విరామం లేకుండా పనిచేత ఒక్క రోజులాగ తోచింది. ఇప్పుడదంతాసరి. నోరా! నాతల్లికి నే నవసరం లేదు. ఇప్పుడామె యీలోకంలో లేదు. నాతమ్ములకు నే నవసరం లేదు. వారికేదో యింతదారి కలిగింది. వాళ్లెలాగో బ్రతగ్గలరు.

నోరా—ఆహా! ఇప్పుడు నీకెంత తేలిగ్గానుంటుంది.—

లిండీదేవి—లేదు. నాజీవితమేమో చెప్పడానికి వీలులేనట్టి గులకలాగుంది. నేను జీవించుట కింక నాకెవ్వరున్నారు? (చికాకుతో లేచి) అందుచేతనే నాచిన్నికూపంలో మరి నిలవలేకపోయాను. ఇక్కడేదైనా దొరికితే ఆయాలోచనలన్నీ లేకుండా నిర్విచారంగానుందామని వచ్చాను. నాఅదృష్టం బాగుంటే ఎదైనా కచేరిపని—

నోరా—కాని క్రిస్టీనీ! అది మిక్కిలి చిక్కైనపని. నువ్వు చాల అలసిపోయినట్టు కనుపిస్తున్నావు. ఏదైనా సముద్రతీరానికి వెళ్లితే మంచిది.

లిండీదేవి—(కిటికీదగ్గరకువెళ్లి) నోరా! సముద్రతీరప్రయాణమునకు కావలసిన డబ్బిచ్చుటకు నాకేమి తండ్రిలేడు.

నోరా—(లేచి) నామీద కోప్పడకు.

లిండీదేవి—(ఆమెదగ్గరకువెళ్లి) నీకు నామీద కోపం లేకుండా వుండాలి. నాఅవస్థలాంటి అవస్థ ఎవరికైనా చికాకు కలిగిస్తుంది. నాకోసం కష్టపడేవాళ్లు లేరు. నేనుమాత్రమెప్పుడు అవకాశాలకెదురు చూస్తూవుండాలి. ఎవరైనా బ్రతకాలా? అందుకనే స్వార్థపరత్వం. మీకు గలిగిన అదృష్టం సంగతి చెప్తూవుంటే—నువ్వుచెప్పితే నమ్మవుగాని—నాకు గలిగినట్టే. నేను పొందిన ఆనందానికి పరిమితిలేదు.

నోరా—నీ వుద్దేశమేమిటి?—ఆఁ తెలిసింది. నాభర్తగారు నీకేమైనా సాయం చెయ్యగలరని.

లిండీదేవి—అవును, నేను తలచినదదే.

నోరా—క్రిస్టైనీ! ఆయన తప్పకచేస్తారు. ఆసంగతినాకు విడిచిపెట్టు. చాల తెలివిగా నేను దాన్ని సంధిస్తాను—ఆయనకేది మిక్కిలి యిష్టమో దాన్ని గురించి ఆలోచిస్తాను. నీకెలాగైనా నే నుపయోగపడ గలిగితే నాకెంతో సంతోషం.

లిండీదేవి—నోరా! నువ్వెంత దయావతివే. నాకు సాయం చెయ్యడానికి తొందరపడుతున్నావు. నీయందు ద్విగుణీకృతమైనదయ యుంది. ఎందుకంటే నీకు జీవితమందలి కష్టసుఖములు తెలియవు.

నోరా—నాకా! జీవితమందలి కష్టసుఖములు తెలియవు?

లిండీదేవి—(చిరునవ్వుతో) ప్రియురాల! నీకు తెలిసినవి స్వల్పమైన యీయింటికష్టసుఖములే కదూ! నోరా! నువ్వింకా పిల్లవు.

నోరా—(తలనెగురవేయుచూ రంగమున కడ్డముగానడచి) ఈవిషయంలో నాకంటే నువ్వంత ఆధిక్యత వహించగూడదు.

లిండీదేవి—ఆధిక్యతవహించ గూడదు?

నోరా—నువ్వూ నలుగురిలాంటి దానివే. వాళ్లందరూ నేనేమి కష్టమైన పనిచెయ్య లేననుకుంటారు—

లిండీదేవి—చెప్పు. చెప్పు.

నోరా—నా కీప్రపంచమందలి కష్టసుఖములయనుభవము లేదనుకుంటారు.

లిండీ—కాని నోరా! నీకు కలిగిన కష్టములన్నీ యిప్పుడు చెప్పేవు గదా.

నోరా—ఛా!—అవేమి కష్టములు. (స్వరముతగ్గిస్తూ) నీకు ముఖ్యమైన సంగతి చెప్పలేదు.

లిండీదేవి—ముఖ్యమైన సంగతా? ఏమిటది?

నోరా—క్రిస్టెనీ! నువ్వు నన్ను తేలికగా చూస్తావు. కాని అలాగు చూడకూడదు. నీతల్లినిగూర్చి నువ్వంత కష్టపడి పనిచేసినందుకు నువ్వు గర్వపడుతున్నావు కావా?

లిండీదేవి——నేనెవ్వరినీ తేలికగా చూడను. కాని నాతల్లి యొక్క జీవితాంత్యదశలో నామె కేవిధమైన విచారములేకుండా చేయగలిగినందుకు నేను గర్వముగాను సంతోషముగాను కూడావున్నాను.

నోరా——మీతమ్ములకు చేసిన సంరక్షణగూర్చి కూడా నువ్వు గర్వపడతావు ?

లిండీదేవి——అట్లు గర్వపడడానికి నాకొకవిధమైనహక్కున్నాది.

నోరా——నేనుకూడా అలాగే అనుకున్నాను. కాని యిప్పుడీమాటవిను. నాకుగూడ నేను గర్వపడి సంతోషపడవలసిన విషయమున్నాది.

లిండీదేవి——అట్టి విషయమున్నాదంటే నేను సందేహించను. కాని అదేదో నువ్వుచెప్పు.

నోరా——మెల్లిగా మాట్లాడు. మాఆయన వినగలరు. వారికెంతమాత్ర మీసంగతి తెలియకూడదు. ఈప్రపంచములోనెవరికి తెలియకూడదు. నీకుతప్ప.

లిండీదేవి——ఏమిటది !

నోరా——(క్రిందను తనప్రక్కనున్న సోఫామీదకామెను లాగును.) ఇప్పుడు నేను దేనినిగూర్చి గర్వమును సంతోషమును పొందవచ్చునో, అది చెప్తాను. నాభర్తప్రాణమును కాపాడినది నేనే.

లిండీదేవి—కాపాడేవా ? ఎలాగు ?

నోరా—నేను, మాయిటలీప్రయాణాన్ని గూర్చి నీతో చెప్పాను గదా. అక్కడికి వెళ్లకుంటే నాభర్త యెంతమాత్రం ఆరోగ్యవంతుడు కాకుండా వుండియుండును.

లిండీ—అవును. దానికి మీనాన్నగారు కావలసిన ద్రవ్యసహాయం చేశారు.

నోరా—(మందహాసంచేస్తూ) అవును! ఆలాగే నాభర్తగారూ, అందరూ అనుకుంటారు. కాని—

లిండీ—కాని—

నోరా—అప్పగారు మాకొక్క చిల్లిగవ్వైనా యివ్వలేదు. ఆసొమ్ము తెచ్చినది నేను.

లిండీ—నువ్వా ? అంతసొమ్మునా ?

నోరా—రెండువందలయాభై పౌనులు.

లిండీ—కాని నోరా! ఆకార్యం నువ్వెలాగు చెయ్యగలిగావు ? ఏదైనా లాటరీలో బహుమాన మొచ్చిందా ?

నోరా—(నిరసనభావముతో) లాటరీలోనా ? అలాగైతే అందులో మరేమి గొప్పున్నాది ?

లిండీ—అయితే మరెక్కడనుండి నీ కాసొమ్ము వచ్చింది ?

నోరా—(అన్యభావమును తెలియజేయు చిరునవ్వునవ్వుతూ కూజితస్వరముతో) హుహూ ! ఆహా !

లిండీ— ఎందుచేతనంటే నువ్వెక్కడా అప్పుతేలేవు కాబట్టి.

నోరా—అప్పుతేలేనూ ? ఎందుచేత ?

లిండీ—తేలేవు. ఎందుచేతనంటే భర్తయనుజ్ఞలేకుండా భార్య అప్పు తేకూడదు కాబట్టి.

నోరా—(తల నెగురవేస్తూ) ఓహో ! ఆభార్యకేమైనా వ్యవహారజ్ఞాన మున్నట్టయితే—ఆభార్యకొకపిసరు తెలివితేట లున్నట్టయితే—

లిండీ—నువ్వు చెప్పిందేమిటో నాకు బోధపడలేదు నోరా !

నోరా—ఏమీఅవసరంలేదు. నే నప్పుచేసేనని యెప్పుడూ చెప్పలేదు. నాకు మరోకలాగ వచ్చివుండవచ్చును. (సోఫామీద వెనక్కుచేరబడును) నన్ను మోహించినవా డెవడేనా నాకిచ్చిఉండవచ్చును. ఎవరైనా నాలా గందంగా నున్నప్పుడు—

లిండీ—నువ్వు పిచ్చిదానివి.

నోరా—క్రిస్టైనీ! ఇదంతా తెలుసుకోడానికి నీకు చాల ఆత్రతగా నుందిగదూ ?

లిండీ—నామాటకు బదులుచెప్పు. నోరా ! నువ్వేమైనా తెలివితక్కువగా ప్రవర్తించలేదుగదా?

నోరా—(తిన్నగా కూర్చొని) తనభర్తప్రాణాన్ని కాపాడుకోడం తెలివితక్కువా ?

లిండీ—తెలివితక్కువగానే కనిపిస్తుంది. అతనికి తెలియకుండా—

నోరా—కాని అతని కేమాత్రం తెలియకుండా వుండడం అత్యావశ్యకం. అయ్యోపుణ్యమా ! నువ్వాపాటి గ్రహించలేకపోయావా ? ఆయన యెంత అపాయస్థితిలోనున్నదీ ఆయనకు తెలియకుండావుండడం ముఖ్యావశ్యకం. ఆయనప్రాణమపాయస్థితిలో నున్నదని వైద్యులువచ్చి నాకుచెప్పారు. ఆయనప్రాణం కాపాడేమార్గం దక్షిణదేశయాత్రచెయ్యడమే. అదంతా నాకోసమే అని నేను మొట్టమొదట విశ్వప్రయత్నం చెయ్యడంలేదనుకున్నావా ? నూతనవధూవరుల కుండవలసినట్లుగా నాకున్నా విదేశయాత్రమీద గాఢప్రేమని యెంతో చెప్పాను. అప్పుచెయ్యవలసిందనికూడా సూచించేను. ఆమాట చెప్పగానే, క్రిస్టైనీ ! ఆయనకు కోపంగూడా వచ్చింది. ఆయన నా కాలోచనలేదన్నారు. నా కెన్విధమైన పిచ్చిపిచ్చికోర్కెలు లేకుండా చూడడం భర్తఅగుటచే తన బాధ్యతన్నారు. 'సరే మంచిదే మిమ్మల నేలాగైనా రక్షించాలి' అనుకున్నాను—అందుచేతనే యీకష్టమునుండి తరించేమార్గ మొకటి ఆలోచించవలసివచ్చింది.

లిండీ—మీతండ్రి నీకు సొమ్మివ్వలేదని నీభర్త కెప్పుడైనా చెప్పలేదా ?

నోరా—లేదు. ఎప్పుడూ చెప్పలేదు. అప్పగారు ఆ సమయంలోనే లోకాంతర్గతులైనారు. అతని కిదంతా రహస్యంగా చెప్పి నాభర్తగారికి తెలియజేయవద్దని ప్రార్థించాలనుకున్నాను. కాని అప్పటి కాయన జబ్బుగానున్నారు- అయ్యో పిదప నతని కెరిగించవలసిన అవసరమే లేకపోయింది.

లిండీ—అప్పటినుండీ నీభర్తకు నువ్వీరహస్యం చెప్పలేదు ?

నోరా—భగవదనుగ్రహించే లేదు. నువ్వదెలా గనుకున్నావు ? ఏవిషయంలోగూడా పైవారిమాట విననివారికి ! అదిగాక ధీరోదారుడైన నానాథునకు నాలాంటి దానిమీద తనప్రాణాని కాధారపడ్డారంటే ఎంతకష్టంగాను, ఎంతచిన్నతనంగాను వుంటుంది. మా యిరువురకు నిప్పుడుగల సంబంధమంతా తారుమారై పోతుంది. నాసుందరతరమందిరము ఇప్పుడున్నంత హాయిగా మరుండదు.

లిండీ— ఎప్పటికీ చెప్పకుండా వుందామనేనా నీ వుద్దేశము ?

నోరా—(ఆలోచిస్తూ సగం చిరునవ్వుతో) చెప్తాను- ఎప్పుడో ఒకనాడు, కొన్నిసంవత్సరములు గడచినపిదప. నే నిప్పుడు కనబడుతున్నంత అందంగా కనబడకుండా వున్నప్పుడు. నన్నుచూచి నవ్వేకు. అంటే నానాథుని కిప్పుడు నామీద నున్నంతప్రేమ లేనప్పుడు, నానృత్యం, నా వేషం, నాసంగీతం,

మొదలైనవాటికి సొమ్మిస్తే నే నెప్పుడూ చక్కనివీ చవుకవే కొనుక్కునేదాన్ని. భగవదనుగ్రహంచే నావొంటిమీద బట్ట మాయకపోవడంచేతను, నాభర్తగారు కనుక్కోలేకపోయి వారు. కాని క్రిస్టైనీ! నాకది చాలకష్టంగానుండేది. ఎందు చేతనంటే చక్కని విలువగల దుస్తులను ధరించడాని కెవరికి కోరికుండదు?

లిండీ—నిజం. నిజం.

నోరా—ధనోపార్జన కనేకమార్గాలు కనిపెట్టేను. గడ చిన శరదృతువులో నాఅదృష్టవశంచే కావలసినన్ని నకళ్ళు వ్రాయడానికి వచ్చాయి. అందుచే నేను ప్రతిసాయంకాలము గదిలో కూర్చొని చాలరాత్రివరకు వ్రాస్తూనే వుండేదాన్ని. అనేకసారులు నేను మిక్కిలి విసికిపోయాను. అయినప్పటికి కష్టపడి పనిచేసి డబ్బుగడించడమనేది చాల సంతోషమైనపని. అప్పుడు పురుషత్వము వహించినట్టే అనిపించింది.

లిండీ—ఆలాగు నువ్వెంతమట్టుకు తీర్చగలిగేవు ?

నోరా—సరిగా చెప్పలేను. ఇటువంటి వ్యవహారంలో చిత్తాఆవజ్ఞా వుంచడం చాలకష్టం. ఒకటిమాత్రం చెప్పగలను. నేను గడించినపెన్నులతో గూడా చెల్లించేశాను. ఒక్కొక్క ప్పుడు నాకేమీ తోచీదికాదు. (మందహాసముచేయును) అప్ప డొకదగ్గిర కూర్చుని ఆలోచిస్తూవుండేదాన్ని. మహాధనికు డొక డునన్ను మోహించినట్టు, అతడు—

లిండీ—ఏమిటి ? ఎవరది ?

నోరా—ఉండు ఊరుకో ?— ఆతఁడు చనిపోయినట్టూ అతనిమరణశాసనం చూస్తే అందులోస్ఫుటమైన పెద్దఅక్షరాలతో నీక్రిందిసంగతులువ్రాసినట్టూ. "నాకున్నయావత్తుధనం హెల్మరుదేవియైన ముద్దులనోరాకు తత్క్షణమే నగదురూపముగా చెల్లించవలెను."

లిండీ—కాని, నోరా ! అత డెవడైయుంటాడు ?

నోరా—అయ్యో పుణ్యమా ! నువ్వుపోల్చుకోలేవా? అటువంటిమనిషే లేడు. అదినేనుకూర్చుని ద్రవ్యంవచ్చేమార్గం తెలియక చేస్తూవుండే ఆలోచన. కాని యిప్పుడదంతా ఒకటే. ఆవిసికించిన వృద్ధుడు ఎక్కడికిపోతే అక్కడికేపోనీ. నాకేంఅవసరంలేదు. ఇప్పుడతడుగాని అతనిమరణశాసనంగాని నాకక్కరలేదు. అటువంటివిచారం ఇప్పుడు మరినాకులేదు. (గెంతును) అదితలచుకుంటే యెంతోసంతోషంగానుంది. క్రిస్టెనీ ! విచారం లేకుండా, ఏవిధమైనవిచారంలేకుండావుండడం. పిల్లలతో కేరుతూ ఆడుకోడం, నానాథునికెలాగిష్టమైతే ఆలాగుచెయ్యడం, అదంతా ఒకసారి తలుచుకో. తత్క్షణమే నీలాకాశమున్నూ వసంతకాలమున్నూ ప్రత్యక్షమౌతాయి. మళ్ళీమరొకయాత్ర చెయ్యగలమేమో—నేను తిరిగీసముద్రాన్ని చూస్తానేమో! ఓహో ! జీవించి ఆనందంగానుండడం చాల అద్భుతమైనసంగతి. (సావడిలోగంటమ్రోగును.)

లిండీ—(లేస్తూ) అదిగో గంటమ్రోగుతున్నాది. నేను వెళ్లిపోవడం మంచిదేమో!

నోరా—వద్దువెళ్లవద్దు. ఇక్కడ కెవరూరారు. మావారికోసం ఎవరోవచ్చారు.

నౌకరు—(సావడిద్వారంవద్ద) అమ్మా! క్షమించండి. బాబుగారిని చూడడాని కెవరోవచ్చారు. బాబుగారిదగ్గర డాక్టరుగా రున్నారు కాబట్టి—

నోరా—ఎవ రతడు?

క్రోగ్స్టాడ్—(ద్వారంవద్ద) నేనమ్మా! హెల్మరుదేవిగారు! (లిండీదేవి లేచి కంపిస్తూ కిటికీవైపుతిరుగును)

నోరా—(అతనివైపు ఒకఅడుగువేసి పట్టినట్టిగొంతుకతో) నువ్వా! ఎందుకు? నాభర్తగారివద్దకు వచ్చినపనిఏమిటి?

క్రోగ్స్టాడ్—బాంకీపని—నాకు బాంకీలో ఒకచిన్న ఉద్యోగముంది. మీభర్తగా రిపుడు నాకు యజమానవుతారని విన్నాను.

నోరా—అవును. అయితే?—

క్రోగ్స్టాడ్—ఏమీలేదు. వ్యవహారంభోగట్టా, అంతే. మరేమీలేదు.

నోరా—ఆపంచలోనికివెళ్లికూర్చోండి. (అలక్ష్యముగానతనికి ప్రతినమస్కారముగావించి సావిడితలుపుమూసివేయును. తరువాతవచ్చి స్టవ్వులో నిప్పువేయును.)

లిండీ—నోరా—ఆవచ్చినవా రెవరు ?

నోరా—ఒకవకీలు. అతనిపేరు క్రోగ్‌స్టాడ్.

లిండీ—అయితే అతడే.

నోరా—అతన్ని నువ్వెరుగుదువా ?

లిండీ—నాకు తెలుసును.—కాని చాలకాలముక్రింద ట అతడు మాపట్నంలో కొన్నాళ్ళు న్యాయాధికారివద్ద గుమ స్తాగా నుండేవాడు.

నోరా—అవును. ఉండేవాడు.

లిండీ—ఇప్పుడు చాలమారిపోయాడు.

నోరా—అత డొక దుఃఖకరమైన వివాహము చేసు కున్నాడు.

లిండీ—అతనిభార్య యిప్పుడు చనిపోయిందికాదూ ?

నోరా—అవును. అతనికి అనేకమంది పిల్లలుగూడాను. అదిగో యిప్పుడు మండుతున్నాది. (స్టవ్వుతలుపుమూసివేసి ఉయ్యాలకుర్చీవైపు జరుగును.)

లిండీ—అత డనేకవిధములైనవ్యవహారాలు నడిపిస్తు న్నాడని విన్నాను.

నోరా—చేస్తాడేమో ! నా కాసంగతేమీ తెలియదు. కాని యిప్పు డావ్యవహారంమాట తలపెట్టకు. చాలచికాకుగా నుంటుంది.

డాక్టరు రాంక్—(హెల్మరుగదినుండి బయటికివచ్చును. అతడు తలుపువేసీకపూర్వము టోర్వాల్డుపిలుచును) లేదు. నీపనికి చెరుపుచెయ్యను. ఒకగడియ నీభార్యవద్దకు వెళ్ళొస్తాను. (తలుపుమూసి లిండీదేవినిచూచును) నన్ను క్షమించండి. మీా పనికిగూడా భంగంకలిగిస్తున్నాను.

నోరా—లేదు. ఎంతమాత్రంలేదు. (పరిచయంగలిగిస్తూ) డాక్టరుగారు! ఈమె లిండీదేవి.

రాంక్—ఆవిడపేరనుకోగా నిక్కడనేకసార్లు విన్నాను. లిండీదేవి! నేను వచ్చేటప్పుడు మిమ్మలను మెట్లదగ్గర తప్పించుకున్నానుకానూ ?

లిండీ—అవును. నేను మెల్లగా ఎక్కుతాను. మెట్లు గబగబ యెక్కలేను.

రాంక్—ఆహా ! ఏదో ఆంతరంగికదౌర్బల్యం ?

లిండీ—ఏమీాలేదూ జరిగినసంగతేమిటంటే నేను విశేషంగా పనిచేస్తున్నాను.

రాంక్—అంతకంటే మరేంలేదా ? అయితే యిక్కడికి మీారు విశ్రాంతితీసికొని ఆనందించడానికి వచ్చారనుకుంటాను.

లిండీ—నేనిక్కడ పనికోసం ప్రయత్నించడానికే వచ్చాను.

రాంక్—విశేషంగా పనిచేసి అలసినందుకదిమందా?

లిండీ—బ్రతకాలిగదండీ డాక్టరుగారు.

రాంక్—అవును. జనుల ఉద్దేశముచూస్తే ఆలాగే కని పిస్తుంది.

నోరా—చూడండి. డాక్టరుగారు—మీకు బ్రతకాల నుందికదా!

రాంక్—నిజంనిజం. ఎంతహేయంగానున్నా నాజీవిత కష్టసుఖాలను పొడిగించాలనేవుంది. నాదగ్గర మందుపుచ్చుకుం టున్న వారందరూ ఆలాగే. నీతి, పాపభీతి,అన్నమాట లేనివాళ్ళు కూడాఆలాగే. అటువంటిదొకటి ఉదాహరణ ప్రస్తుతం హెల్మరు వద్దనున్నాది.—

లిండీ—(విచారముతో) ఆహాఁ!

నోరా—ఎవరినుద్దేశించి అంటున్నారు?

రాంక్—క్రోగ్‌స్టాడ్ అనేవకీలు మీకందరకూ తెలిసి నవాడే. అతనికి నీతి పాపభీతి అన్నమాటపూజ్యం. కాని అతడు గూడ తాను జీవించడము చాలముఖ్యమైనదిగా చెప్తాడు.

నోరా—ఆలాగుచెప్పాడా? మావారితో దేన్నిగూర్చి మాట్లాడడానికివచ్చాడు?

రాంక్—నాకేమీ తెలియదు. ఏదో బాంకీసంబంధ మైనదనిమాత్రంవిన్నాను.

నోరా—నాకీసంగతి తెలియలేదు—అతనిపేరేంపేరు— బాంకీలోనతని కేంపని?

రాంక్—ఉంది! అతనికి బాంకీలో ఏదోవుద్యోగంవుంది. (లిండీదేవితో) మీతట్టుగూడా యిలాంటిసంగతులున్నాయో లేదో తెలియదు. అత్యుత్సాహంతో నైతికదురాచారాలకో సం వెనికి వెనికి అట్టిదురాచారులు పట్టుబడ్డప్పుడు బాగాడబ్బు వచ్చేపనిలోవేసి వారినొకకంట చూడడం. సాత్వికులై నిర్మల స్వభావులనుమాత్రం ఓరుగాలిలో వదిలీడం.

లిండీ—ఇప్పటికిగూడా జబ్బువారినిగూర్చే మనం జాగ్రత్తపుచ్చుకోవాలి.

రాంక్—(కరములుముకుళించి) అవును. మీరుచెప్పింది నిజం. ఆవుద్దేశమే సంఘాన్నంతా ఒకపెద్దరోగులసాలగా మారుస్తున్నాది.

[తనయాలోచనలో నిమగ్నమై నోరా యొక్కసారి నిరుద్ధమైన నవ్వునవ్వి చేతులు చరచును.]

రాంక్—దానికెందుకు నవ్వుతావు? నిజంగా సంఘం మెలాంటిదో నీకేమైనా ఆలోచనుందా ?

నోరా—ఈనిప్రయోజనకరమైన సంఘాన్ని గురించి నేనెందుకు తలమొత్తుకోవాలి ? దీనికంటె భిన్నమై అతివినోదమైనదాన్నిగూర్చి నేను నవ్వుతున్నాను. డాక్టరుగారు నాకు చెప్పండి. బాంకిలోని ఉద్యోగస్థులందరు టోర్వాల్డుమీదనే ఆధారపడి యున్నారా ?

రాంక్—అదా ! నీకంతవినోదంగా కనబడుతున్నాది ?

నోరా—(చిరునవ్వుతో కూనురాగంతీస్తూ) అదే నాకు కావలసినసంగతి. (గదిలోనిటునటుపచారుచేస్తూ) మా కీపాటి పలుకుబడివుండడం కీర్తికరం—నాభర్తచేతులో నీపాటియధికార ముండడం (తనజేబులోనుండి పొట్లాంతీసి) డాక్టరుగారు! ఈబి స్కత్తులకు మీరేమంటారు?

రాంక్—ఏంబిస్కత్తులు? ఇక్కడ కవి తేకూడదని నేను విన్నాను.

నోరా—అవును. కాని యివి నాకు క్రిస్టైనీ యిచ్చింది.

లిండీదేవి—ఏమిటి! నేనా?

నోరా—వద్దు. ఏంభయపడవద్దు. మావారు వాటి నిక్కడకు తేవద్దన్నమాట నీకెలాగు తెలుస్తుంది. మరేంలేదు. వారి భయమేమిటంటే అవి నాపండ్లందాన్ని పోగొడతాయని. కాని-హ్వా-ఒకలాగదీ నిజమే. డాక్టరుగారూ! కాదూ? నామా టవిని(ఒకబిస్కత్తు ఆమెనోట్లోపెట్టి) క్రిస్టైనీ! నువ్వొక్కటీతిను. నేనొకటో తప్పితే రెండో తింటాను. నాకీప్రపంచంలో ముఖ్యం గా ప్రియమైన దొక్కటుంది.

రాంక్—ఏమిటది?

నోరా—నామాటగాని నాభర్తమున్నస్తే- లోకంలో నత్యధికప్రియమైనది—

రాంక్—సరే, ఎందుకది చెప్పవు?

నోరా—లేదు. చెప్పడానికి వీలులేదు. నాకు భయం వేస్తుంది.

లిండీ—భయంవేస్తుంది?

రాంక్—అయితే అదిచెప్పమని నిన్ను బలవంతపెట్ట గూడదు. అయినా మాతో నువ్వు చెప్పవచ్చును. టోర్వాల్డు నీ మాటవమన్నిస్తే నువ్వెంతప్రీతితో చెప్పవలసిందేమిటి?

నోరా—నాకిప్పుడు చెప్పడానికిష్టమే - నేను పాడైపోతాను.

రాంక్—నీకేం పిచ్చెత్తిందా?

లిండీ—ప్రియా! నోరా!

రాంక్—అదిగో వస్తున్నాడు. ఏమిటో చెప్పు.

నోరా—(పొట్లాం దాచేస్తు) ఊరుకో! ఊరుకో!

(హెల్మరు ఒకచేతికి కోటుతొడుక్కుని, రెండోచేతితో హాట్ పట్టుకొని తనగదినుండి పైకివచ్చును.)

నోరా—నాధా! మెల్లిగా వదల్చుకున్నారా?

హెల్మరు—ఆఁ. ఇప్పుడే వెళ్ళిపోయాడు.

నోరా—ఈమె క్రిస్టైనీ. ఈవేళే పట్నంలోనికి వచ్చింది.

హెల్మరు—క్రిస్టైనీవా? క్షమించు. ఆమె యెవరో నాకు—

నోరా—లిండీదేవి. క్రిస్టైనీలిండీ.

హెల్మరు—ఆహాఁ! నాభార్య సహపాఠిఅనుకుంటాను.

లిండీ—అవును. అప్పటినుండే మాస్నేహం.

నోరా—ఆమె కష్టపడి యింతదూరం మీ గురించే వచ్చింది.

హెల్మరు—నువ్వన్నమాటేమిటి?

లిండీ—లేదు. నిశ్చయంగా నేను—

నోరా—క్రిస్టైనీకి బుక్కీపింగు చాలాబాగావచ్చును. ఆమెకు పరిపూర్తిగా వచ్చిందాకా, ఎవరైనా తెలివైనవారి వద్ద పనిచెయ్యాలని చాలా ఆత్రుతగానున్నది.

హెల్మరు—లిండీదేవి చాల తెలివైనపనిచేసింది.

నోరా—మీకు బాంకీమేనేజరుపనైందని తెలియగానే ఆసంగతి తంతిమూలంగా తెలియజెయ్యడమైంది. ఆమె అతి త్వరగా ఇక్కడకు పరుగెత్తుకు వచ్చింది. నన్ను చూచి మీ రామెకేదైనా సాయంచేస్తారనుకుంటాను. ఏం ?

హెల్మరు—సరే. అది అంత దుస్సాధ్యంకాదు. మీరు వితంతువు లనుకుంటాను. కారా లిండీదేవిగారు ?

లిండీ—అవును.

హెల్మరు—మీకు బుక్కీపింగులో కొంత అనుభవం కూడావుంది?

లిండీ—అవును. ఒకమాదిరిగా.

హెల్మరు—ఆహా! సరే. అయితే మీ కేదైనా సదుపాయం చెయ్యగలననుకుంటాను.

నోరా—(చప్పట్లు చరుస్తూ) నీ కేమనిచెప్పాను. నీకే మనిచెప్పాను ?

హెల్మరు—లిండీదేవిగారు! మీరు మంచిఅనుకూలమైన సమయానికేవచ్చారు.

లిండీ—మీకెలాగు నాకృతజ్ఞత తెలియజేయగలను?

హెల్మరు—అదేమి అవసరములేదు. (తనకోటు తొడుగుకొనును) కాని, ఇవాళకు క్షమించాలి—

రాంక్—ఒకనిమిష మాగు. నేనుకూడా వస్తాను. (రోమ సంబంధమైన తనకోటును తెచ్చి నిప్పుదగ్గర వెచ్చచేయును.)

నోరా—నాథా! వెళ్ళి అక్కడేవుండిపోకండి.

హెల్మరు—ఆలస్యంచెయ్యను. ఒకగంటలో వెళ్ళిపోవస్తాను.

నోరా—క్రిస్టైనీ! నువ్వుకూడా వెళిపోతున్నావా?

లిండీ—(తనవస్తువులు ధరించి) అవును. నేనుపోయి గది చూచుకోవాలి.

హెల్మరు—ఆహా! మనమందరము కలిసి వీధికొనదాక వెళ్ళవచ్చును.

నోరా—(ఆమెకు సాయంచేస్తూ) అయ్యో! మనం కలిసి ఒకగడియైనా కూర్చోవడమైందికాదు. మరి వీలేదేమో అని నేనుభయపడుతున్నాను.

లిండీ—అలా తలచవద్దు నోరా! వెళ్ళివస్తాను. నమస్కారము.

నోరా—నే నుంటాను. ఈసాయంత్రం నువ్వు తప్పక వస్తావుకదూ ? మీరుకూడాను. డాక్టరుగారు ఏమంటారు ? మీరు కులాసాగా నుంటేనా? మీరు కులాసాగానే వుండాలి. బాగా కప్పుకోండి.

[వారందరు మాట్లాడుతూ తలుపువద్దకు పోవుదురు పిల్లల కేకలు మెట్లమీాద వినబడును.]

నోరా—అదుగో. అదుగో. (ఆమె ద్వారముకువద్దకు పరుగెత్తును. పిల్లలను తోడ్కొని దాది లోనికి ప్రవేశించును.) రండి. రండి. (ఆమె వారిని వంగి ముద్దుపెట్టుకొనును.) నాయనలార! క్రిస్టినీ! వారిని చూశావా ? బాగున్నారా ?

రాంక్—మమ్ముల నీగడపలో నిలబెట్టకు.

హెల్మరు—లిండీదేవిగారు రండి. ఈదృశ్యము తల్లులకు మాత్రమే భరింపశక్యము.

[రాంక్, హెల్మరు, లిండీదేవి మెట్లు దిగుదురు. దాది బిడ్డలను తీసుకుని ముందుకువచ్చును. నోరా సావడితలుపు మూసివేయును.]

నోరా—మీా రెంత అందంగాను నూతనంగాను కనిపిస్తున్నారు! ఆ యెర్రని చెక్కులు—గులాబీలవలె (ఆమె మాట్లాడుతూవుండగా పిల్లలందరూ నొక్కసారిగా మాట్లాడుదురు.) మీారు హాయిగా ఆడుకున్నారుగదూ! చబాష్! ఏమిటి ?

నువ్వు ఎమ్మీ, బాబు, ఇద్దరూ కూర్చుండగానే బండి లాగే శావు ? ఇద్దర్నీ ఒక్కమాటే ? చబాష్ ! నువ్వు చాల తెలివైనవాడివి ఇవార్ ! ఆబొమ్మపిల్లను నన్నొక్కమాటు ఎత్తుకోనీ. ఏనీ. (బిడ్డను దాసీచేతినుండి తీసుకొని క్రిందికీ మీదికీ ఆడించును) అలాగే. అలాగే. అమ్మ బాబునుగూడా ఆడిస్తుంది. ఏమిటి ? మంచుకు మీరు బంతులుగా కట్టేరా ? అయ్యో ! నేనక్కడ లేకపోయాను. ఉండుండు. ఏనీ! వాళ్ళవస్తువులు నేను తీస్తాను. నాకు చాలసరదా. నువ్వు లోపలికివెళ్ళు. మంచుచే కొయ్యబారినట్టున్నావు. నీకోసం స్టవ్వుమీద వేడికాఫీవుంచాను.

[దాది యెడమవైపునున్న గదిలోనికి వెళ్లును. పిల్లలందరు తనతో నొక్కసారిగా మాట్లాడుతున్నప్పుడు నోరా వారివస్తువులన్నిటీ తీసి విరజల్లును.]

నోరా—నిజమే ? నీవెనక పెద్దకుక్క పరిగెత్తింది ? కాని అది నిన్ను కరవలేదూ ? కుక్కలు మంచిపిల్లలను కరవవు. నువ్వు కట్టలతట్టు చూడకూడదు. ఇవార్, అవేమిటి ? అవేమిటో నీకు తెల్సుకోవాలని లేదుగదూ ? ఉండను. అది చాల అసహ్యమైంది- రా- మనం ఆడుకుందాం. మన మేమిటాడుకుందాం ? దాగుడుమూతలా ? అలాగే మనం దాగుడుమూతలాడుకుందాం. బాబు మొదట దాగుంటాడు- నేను దాగునేదా ? సరే. నేనే మొదట దాగుంటాను. (ఆమెయు పిల్లలూ సంతోషంతో, నవ్వుతూ అరుస్తూ గదిలోపలా బయట

టూ ఆడుదురు. కడపట నోరా మేజాక్రింద దాగొనును. పిల్లలామెకొరకు పరుగెత్తిచూతురు. కాని యామెను కనుగొనలేకపోవుదురు. ఆమెయొక్క నిరుద్ధహాసము విని మేజాకడకు పరుగెత్తి పరచిన గుడ్డనెత్తి ఆమెను కనుగొందురు. ఒక్కసారిగా నవ్వులు. ఆమె ముందుకుప్రాకి వారిని భయపెట్టినట్లు నటించును. తిరిగీ నవ్వుదురు. ఇంతలో సావిడితలుపు కొట్టుటవినబడును. కాని యెవరును వినిపించుకోకుందురు. తలుపు సగము తెరవబడియుండును. క్రోగ్స్టాడ్ కనబడును. అతడు కొంచెముసేపు నిలబడును. ఆట జరుగుతునే వుండును.)

క్రోగ్స్టాడ్—హెల్మరుదేవిగారు క్షమించండి.

నోరా—(నిరుద్ధస్వరముతో వెనుకకుతిరిగి మోకాళ్లమీద నిలబడి) ఆం. నీకేమిటి కావాలి ?

క్రోగ్—క్షమించండి. వీధితలుపు కొంచెంతీసుంది. ఎవరో తలుపువెయ్యడం మరచిపోయారు.

నోరా—(లేచి) నాభర్తగారు వీధిలోనికి వెళ్ళారు. క్రోగ్స్టాడ్.

క్రోగ్—అవును. నాకది తెలుసును.

నోరా—అయితే యిక్కడ నీకేం గావాలి ?

క్రోగ్—మీతో ఒకమాట చెప్పాలి.

నోరా—నాతోనా ? (నెమ్మదిగా పిల్లలతో) మీరు దాదిదగ్గరకు వెళ్ళండి. ఏమిటి ? భయంలేదు. ఆకొత్తమనిషి

అమ్మనేం జెయ్యాడు. అతడు వెళ్ళిపోయినతరువాత మళ్ళీ మన మాడుకుందాం. (పిల్లలను ఎడమవైపునున్న గదిలోనికి తీసి కొనిపోయి వారినందులోనుంచి తలుపువేయును.) నాతో నీకు మాట్లాడవలసివుందా ?

క్రోగ్—అవును.

నోరా—ఈవేళా ? ఇంకా నెలారంభం కాలేదు.

క్రోగ్—లేదు. ఇంకా రేపు క్రిష్టమస్. మీరు క్రిష్టమస్సెలాగు గడపాలో మీమీద ఆధారపడి వుంటుంది.

నోరా—నీకేమిటికావాలి ? ఇవాళ యెంతమాత్రం నాకు సాధ్యంకాదు.

క్రోగ్—దానినిగురించి యిప్పుడు నేను మాట్లాడడం లేదు. ఇది వేరేదానినిగురించి. మీకొకగడియ తీరుబాటుందా?

నోరా—ఆఁ—ఆలాగే. నాకు అయినప్పటికి—

క్రోగ్—సరే. ఆల్సేన్సుసత్రములోనుండి, మీభర్త గారు వెళుతూవుండడము నేను చూశాను.

నోరా—ఆఁ.

క్రోగ్—ఒకస్త్రీతోగూడా.

నోరా—అయితే.

క్రోగ్—ఆమె లిండీదేవి ఔనోకాదో నేనడగవచ్చా?

నోరా—అవును లిండీదేవే.

క్రోగ్—ఇప్పుడే ఊరునుండి వచ్చినదా ?

నోరా—అవును. ఇవాళే.

క్రోగ్—మీకామె ముఖ్యస్నేహితురాలు కాదూ !

నోరా—అవును. కాని యిదంతా యెందుకో నాకు—

క్రోగ్—ఒకప్పుడు నేనుగూడా ఆమె నెరుగుదును.

నోరా—ఆసంగతి నాకు తెలుసును.

క్రోగ్—మీకూ తెలుసునా ? కాబట్టి ఆసంగతంతా మీకు తెలుసును. నేనూ ఆలాగే అనుకున్నాను. అయితే నేను శాఖాచంక్రమరణం చెయ్యకుండా ఒక్కమాట అడుగుదునా? లిండీదేవికి బాంకీలో ఉద్యోగం అవుతుందట ?

నోరా—ఆసంగతి నన్నడగడానికి నీ కేమధికారముంది క్రోగ్‌స్టాడ్ ? నాభర్త క్రిందివుద్యోగస్థులలో నొకడవయ్యుండి—కాని నువ్వడిగావు కాబట్టి చెప్పుతున్నాను. లిండీదేవిగారికి బాంకీలో ఉద్యోగం అవుతుంది. ఆమెనుగూర్చి నేనే పట్టుబట్టి చెప్పాను. క్రోగ్‌స్టాడ్ ! ఈసంగతికూడా తెలుసుకో.

క్రోగ్—నే ననుకున్నదంతా సరిగానే వుంది.

నోరా—(రంగమందిటునటు నడుస్తూ) ఎవరిమూలైనా ఒకొక్కప్పుడు చెల్లుతూవుంటుంది. “ఇదాడదిగదా? దీన్ని కేంపలుకుబడి” అని—క్రోగ్‌స్టాడ్ ఒకరిక్రింద పనిచేస్తున్నప్పుడు ఎవరైనాసరే, అధి—అధి—

క్రోగ్‌స్టాడ్—అధికారంవున్నవారికా ?

నోరా—ఆం. అవును. అధికారంవున్న వారికి కోపంరా కుండా చూచుకోవాలి.

క్రోగ్‌స్టాడ్—(ధోరణిమార్చి) హెల్మరుదేవి ! నా గురించి మీపలుకుబడి ఉపయోగించరాదా ?

నోరా—ఏమిటి ? నీవుద్దేశమేమిటి ?

క్రోగ్—దయయుంచి బాంకీలో నాపని నాకున్నట్లు చూడండి.

నోరా—నువ్వన్నమాటేమిటి ? నీపని తీసియ్యాలని యిప్పుడెవరు తలుస్తున్నారు ?

క్రోగ్—ఇంకా మీరు తెలియనట్టు నటిస్తే లాభంలేదు. నాతో పోటీతగలడానికి మీస్నేహితురాలికష్టే ఆత్రుతలేని సంగతి నాకు తెలుసును. ఈపనిలోనుండి నన్ను తీసేడానికి కారణ మెవరో కూడా నాకు తెలుసును.

నోరా—కాని నేను నిశ్చయంగా చెప్పగలను—

క్రోగ్‌స్టా—కావచ్చును. కాని ప్రస్తుతాంశంవినండి. నన్ను తీసేకుండా మీపలుకుబడి వినియోగించేకాలం వచ్చింది.

నోరా—కాని క్రోగ్‌స్టాడ్ ! నాకేమి పలుకుబడిలేదు.

క్రోగ్—మీకు పలుకుబడి లేదా? పలుకుబడివున్నాదని యిప్పుడే మీరు చెప్పినట్టు జ్ఞాపకం.

నోరా—ఆమాటకు నువ్వేఅర్థం తీస్తావనుకోలేను. నేనా! దేనివల్ల నామాట నాభర్తవద్ద చెల్లుతుందని నువ్వనుకున్నావు?

క్రోగ్—నేను మీభర్తగారిని మేం చదువుకున్నప్పటినుండీ యెరుగుదును. తక్కినవొళ్ళకంటే అత డేమి స్వర్గమునుండి వూడిపడ్డాడని నే ననుకోను.

నోరా—నువ్వు నాభర్తను తూలనాడేవంటే నిన్నింట్లోనుండి గెంటించేస్తాను.

క్రోగ్—మీరు చాలధైర్యవతులమ్మా!

నోరా—నీకు నేనేమి జడవను. కొత్తసంవత్సరంరాగానే నీసొమ్మయావత్తూ పెన్నులతోటి పారేసి నీవ్యవహారం తెగతెంపు చేసుకుంటాను.

క్రోగ్—(ఓర్చుకుంటూ) దేవీ! నామాట వినండి. అవసరమైతే బ్యాంకీలోని యీ చిన్నవుద్యోగానికి నాప్రాణం పోయిందాక పోరాడుతాను.

నోరా—అలాగే కనిపిస్తుంది.

క్రోగ్—ఇదంతా యిప్పుడు సొమ్ముకోసం కాదు. అదంత ముఖ్యమైనది కాదు. ఈవ్యవహారంలో మరొక కారణముంది. సరే చెప్తాను వినండి. ఒకానొక కాలంలో అందరిలాగానే నేను తెలివితక్కువపని చేశాను. మీకుకూడా తెలుసును.

నోరా—అవును. దానిగూర్చి నేనేదోవిన్నట్టు జ్ఞాపకం.

క్రోగ్—ఆవ్యవహారం కచేరికెక్కలేదు. అది సులువుగా తెగిపోయింది. అందుచేత మీకు తెలిసిన ఆవ్యవహారం నేను పూనుకున్నాను. ఇంకా నేను కొంత చెయ్యవలసివుంది. కాని నిజంగా నేనేమి తప్పుచేశానని తలచకండి. కాని నే నిప్పుడు దాని అంతటనుండి విముక్తుడనుకావాలి. నా కుమాళ్ళు యిదుగురున్నారు. వారికొరకైనా యీపట్నంలో నాప్రతిష్ఠ నిలుపుకోవాలి. ఈబాంకిగోపని నాపునఃప్రతిష్ఠకు ప్రథమసోపానంలాగుంది. కాని యిప్పుడు మీభర్తగారు నన్ను తన్ని మెట్లనుంచి తిరిగీ బురదలోనికి తోసియ్యాలని చూస్తున్నారు.

నోరా—కాని నామాటనమ్ము క్రోగ్‌స్టాడ్. నీకు సహాయం చెయ్యడానికి నాకు శక్తియెంతమాత్రం లేదు.

క్రోగ్—అయితే నాకు సహాయ్యం చెయ్యడానికి మీకిష్టం లేదన్నమాట; కాని మిమ్మ చేసేటట్టు చెయ్యడానికి నాకు మార్గముంది.

నోరా—నీకు నేను బాకీవున్నసంగతి నాభర్తతో చెప్పుదామని నీ వుద్దేశమా?

క్రోగ్—హుఁ! ఒకవేళ చెప్తే?

నోరా—ఆలాగుచెయ్యడం మిక్కిలి నీచం (నిట్టూర్పు స్తూ) నాకానందకందమయ్యుండే యీరహస్యం అతనికి తెలియడం—ఇంత అపసవ్యంగా—అసహ్యకరంగా—అసందర్భ

ముగా నీవల్ల నతనికి తెలియడం! నాకు మిక్కిలి దుర్భరమైన అవస్థకలిగిస్తుంది.

క్రోగ్—ఒక్క దుర్భరమేనా?

నోరా—(తిరస్కారభావముతో) సరే. నీయిష్టంవచ్చినట్టుచెయ్యి! అది నీకే ముప్పు—నువ్వేటువంటి నీచుడవో నా భర్త వెంటనే తెలుసుకొని వెంటనే నిన్ను పనిలోనుండి తొలగించెస్తారు.

క్రోగ్—నేనడిగింది "ఒక్క యింటివద్దనే దుర్భరంగా వుంటుందని జడుస్తున్నారా? అని.

నోరా—నాభర్త కీసంగతిగాని తెలిసిందంటే ఇంకా నీకెంతబాకీవున్నానో వెంటనే పారేస్తారు. అంతలో నీచీడ మాకు వదులుతుంది.

క్రోగ్—(ఒక అడుగు దగ్గరకువచ్చి) దేవీ! నామాట వినండి- మీకు జ్ఞాపకమైనా లేకపోయుండాలి. లేదా మీకు వ్యవహారజ్ఞానమైనా లేకపోయుండాలి. కొన్నిముఖ్యాంశములు జ్ఞాపకం చేస్తాను.

నోరా—ఏమిటవి?

క్రోగ్—మీభర్తగారు జబ్బుగా నున్నప్పుడు మీరు నావద్దకువచ్చి రెండువందలయాభై పౌనులు అప్పుతీసుకున్నారు.

నోరా—నేను మరెవ్వరిని యెఱుగకపోవడంచేత.

క్రోగ్—మీకు కావలసినసొమ్ము నే నిస్తానని ఒప్పు కున్నాను.

నోరా—అవును. తెచ్చికూడా యిచ్చావు.

క్రోగ్—ఆసొమ్ము కొన్ని షరతులమీద మీకు తెచ్చి స్తానన్నాను. మీమనస్సులో నెల్లప్పుడు మీభర్తగారి వ్యాధిని గూర్చే తలచుకొనుటచేతను, మీప్రయాణమునకై యెలా గైనా సొమ్ముకొరకై తొందరపడుతూ వుండుటచేతను, ఆషర తులకు మీరంత లెక్కించినట్లు కనబడదు. కాబట్టి యిప్పు డవన్నీ స్మరణకు తేవడం బాగుండదు. అప్పుడు నేను మీరు వ్రాసిన పత్రానికి యెవరైనా పూచీపడితే సొమ్మిస్తానన్నాను.

నోరా—అవును. దానిమీద నేను సంతకంగూడా చేశాను.

క్రోగ్—సరే. బాగానేవుంది. మీసంతకంక్రింద సొమ్ము కు పూచీదారుడైన మీతండ్రిగారి చేవ్రాలునకై కొంతజాగా వుండెను. అక్కడ మీతండ్రిగారు సంతకం చేసియుండాలి.

నోరా—చేసియుండాలి ? అతడే చేశాడు.

క్రోగ్—నేను తేదీ వెయ్యవలసినస్థలము కాళీగానే వుంచేశాను. అంటే మీనాన్నగారు సంతకంచేసి తేదీ వెయ్యా డానికి. మీకు జ్ఞాపకంవుందా ?

నోరా—అవును. కొంచెం జ్ఞాపకంవుంది.

క్రోగ్—అంతట మీనాన్నగారికి తపాద్వారా పంపించమని ఆపత్రం మీ కిచ్చేశాను. అవునా కాదా ?

నోరా—అవును.

క్రోగ్—మీరు సహజంగా అలాగే చేశారు. ఎందుకంటే అయిదారురోజుల తరువాత మీతండ్రిసంతకంతో పత్రాం నాదగ్గరకు తీసుకొచ్చారు. అప్పుడు నేను మీకు సొమ్మిచ్చాను.

నోరా—అయితే నేను మరి నీకు సొమ్ము సరిగా చెల్లిస్తూవుండలేదా ?

క్రోగ్—అవును. చెల్లిస్తూవుండేవారు. కాని—ప్రస్తుతాంశానికి రానీయండి. అది మీకు చాలా కష్టకాలంకాదా ?

నోరా—అవును. నిజమే.

క్రోగ్—మీనాన్నగారికి మిక్కిలి జబ్బుగానుండేది. కాదా ?

నోరా—అతని చరమదశ సమీపించింది.

క్రోగ్—కొద్దిరోజులలో మరణించారు. ఏం ?

నోరా—అవును.

క్రోగ్—దేవీ ! చెప్పండి. మీ కతడు మరణించినవారమేమైనా జ్ఞాపకముందా ? అంటే యే నెల యే తేది ?

నోరా—అప్పగారు సెప్టెంబరు ౨౯ వ తేదీని గతించినారు.

క్రోగ్—అది సరియైనదే. నేనుకూడా కనుక్కొన్నాను. అయితే యిందులో సందర్భవిరోధమైన పొరపాటుంది. (జేబు లోనుండి కాగితముతీసి) దీనికి కారణమేమిటో నాకు తెలియదు.

నోరా—ఏంపొరపాటు ? నాకేం తెలియదే !

క్రోగ్—ఇక్కడగలిగిన సందర్భవిరోధ మేమిటంటే, అతడు మరణించిన మూడుదినముల తరువాత అతని చేవ్రాలు చేయబడివుంది.

నోరా—నువ్వన్నమాటేమిటి ? నాకు బోధపడలేదు.

క్రోగ్—మీనాయనగారు సెప్టెంబరు ౨౯ వ తేదీని మరణించినారు. కాని యిక్కడ చూడండి. మీతండ్రిగారు అక్టోబరు ౨ వ తేదీని చేవ్రాలుచేసినట్లు తారీఖున్నది. అది పొరపాటుకాదా ? (నోరా నిరుత్తరయై యుండును.) మీరు దీనికి సమాధానం చెప్పగలరా ? (నోరా యింకను పలుక కుండును.) ఇంకొకసంగతికూడాను. అక్టోబరు ౨ వ తేదీయు సంవత్సరమున్నూ మీనాన్నగారి దస్తూరీకాదు. నాకు తెలి సిన మరొకవ్యక్తిదస్తూరి. సరే. దాని కెలాగో సమాధానం చెప్పుకోవచ్చును. మీనాన్నగారు తేదీ వెయ్యడం మరచిపో యుండవచ్చును. ఎవరో తొందరలో అతడు మరణించినట్లు తెలియకపూర్వము తారీఖువేసి వుండవచ్చును. అందులో ఏ మంత ప్రమాదంలేదు. అంతా ఆసంతకంమీదనే ఆధారపడి వుంది. ఆసంతకం యధార్థమైందే అనుకుంటాను. ఏం ? ఇక్కడ సంతకంచేసింది మీనాన్నగారేకదూ ?

1.

నోరా—(కొంతసేపూరకొని, తలనెత్తి నిరసనభావముతో నతనివైపుచూస్తూ) లేదు. ఆసంతకంచేసినవారు అప్పగారు కాదు. నేనే అతని సంతకంచేశాను.

క్రోగ్—ఆమాట ఒప్పుకుంటే యెంత ప్రమాదమో మీకు తెలుసునా ?

నోరా—నీసొమ్ము త్వరలో నీకిచ్చేస్తాను.

క్రోగ్—ఈప్రశ్నకు జబాబు చెప్పండి. ఆపత్రం యెందుకు మీనాన్నగారికి పంపించలేదు ?

నోరా—అది అసంభవము. అతడు చాలాజబ్బులో నున్నాడు. అతని సంతకం చెయ్యమంటే ఆసొమ్ము ఎందుకో అతనికి బోధపర్చవలసి వుంటుంది. అతడంత జబ్బుగానున్నప్పుడు నాభర్తప్రాణం గూడా అపాయస్థితిలో నుందని చెప్పలేక పోయాను. చెప్పడానికి వీల్లేక పోయింది.

క్రోగ్—అలాగైతే యీయాత్ర మానేసుకుంటే బాగావుండేది.

నోరా—లేదు. మానీడానికి వీలులేదు. నాభర్తప్రాణాన్ని కాపాడడానికి అది ముఖ్యావశ్యం. అందుచేతనే నేను మానలేక పోయాను.

క్రోగ్—కాని దగాచేస్తున్నారని మీమనస్సు కెప్పుడైనా తోచలేదా ?

నోరా—ఆసంగతి మరి నా తలపునకు రాలేదు. దాని గురించి నేనట్టె తల బద్దల చేసుకోలేను. నాకదంతా దుర్భరమై పోయింది. నువ్వు దయా రహితుడవై నా కనేకమైన ఆటంకాలు కల్పించావు; నాభర్త దుస్థితి తెలిసినప్పటికి.

క్రోగ్—దేవీ! మీరేమి నేరంచేశారో మీకు సరిగా తెలియలేదు. కాని నేను దృఢంగా చెప్పగలను. నాప్రతిష్ట పోగొట్టుకొనుటకు పూర్వం నేను చేసిన దుస్తంత్రం, మీరు చేసినదానికంటే మాత్రం అధమంకాదు.

నోరా—నువ్వు చేసినదా? నువ్వుపడిన కష్టాలన్నీ నీభార్యను రక్షించుట కోసమేనా?

క్రోగ్—న్యాయశాస్త్రము మనవుద్దేశముల నేమాత్రము సరకు చెయ్యదు.

నోరా—అలాగైతే అది పనికిమాలిన న్యాయశాస్త్రం.

క్రోగ్—పనికిమాలినదో మంచిదో కాని యీపత్రమునుగాని నేను దాఖలు చేస్తే మిమ్ము నా న్యాయశాస్త్రప్రకారమే విచారిస్తారు.

నోరా—నేను దానిని నమ్మను. మరణాసన్నుడైన తండ్రి యాందోళనమును మాన్పుటకు కుమార్తెకు హక్కులేదా? తనభర్త ప్రాణమును రక్షించుటకు భార్యకు హక్కులేదా? న్యాయశాస్త్రమును గురించి నాకంతగా తెలియదు. కాని న్యాయశాస్త్రములు వానిని కొంచె మాలోచించాలి.

అట్టి పద్ధతులను గూర్చి నీకు తెలియదా? నువ్వుకూడా వకీలువుకదా? క్రోగ్‌స్టాడ్! నువ్వంత తెలివైన వకీలువుగా కన బడవు.

క్రోగ్—కాకపోవచ్చును. కాని మీరూ నేనూ చేస్తు న్నలాంటి యిటువంటి వ్యవహారాలు నాకు తెలయవనుకున్నా రా? సరే! కానియ్యండి. మీయిష్టం వచ్చినట్టేచెయ్యండి. కాని యిది మాత్రం తెలుసుకోండి—ఈసారిగాని నాపని పో యిందంటే, నాపనితోగూడా మీపనిపోతుంది. (నమస్కరించి పావడిగుండా పోవును.)

నోరా—(ఒకగడియ ఆలోచనలో నిమగ్నయై పిదప తలపంకించును.) "చా! చా! అలాగు వన్ను భయపెట్టడానికి చూశాడు. అతడు తల చినంత తెలివితక్కువదాన్ని నేను కాను. (పిల్లల వస్తువులు సర్దుటకు ప్రారంభించును) అయినప్పటికీ—? లేదది వట్టిమాట. నేను ప్రేమచేత చేశాను.

పిల్లలు—(ఎడమవైపునున్న ద్వారంలో) అమ్మా! ఆక్రొత్తమనిషి వెళ్లిపోయాడు.

నోరా—అవును. నాయనలారా! నాకు తెలుసును. కాని ఆవచ్చిన మనిషి గురించి యెవరితోను చెప్పకండి. విన్నా రా! అప్పగారితో గూడ చెప్పకండి.

పిల్లలు—లేదమ్మా! చెప్పం. కాని మాతోవచ్చి ఆడవా?

నోరా—లేదు. ఇప్పుడు కాదు.

పిల్లలు—కాని అమ్మా! నువ్వాడతానని చెప్పావు ?

నోరా—అవును. చెప్పేనుకాని యిప్పుడాడలేను. లోపలికిపొండి. నాకు చాల పనుంది. లోపలికి వెళ్ళిపోండి ! (ఆమె మెల్లిమెల్లిగా గదిలోనికిపోయి తలుపు మూసివేయును. అంతట సోఫామీద కూర్చుని గుడ్డతీసి కొంచెము కుట్టి మరలనాపును.) కాదు. (చేతిలోనున్నబట్ట క్రింద పారవైచి, లేచి సావడిద్వారముదద్దకు వెళ్లి సొరుగుతీసి మరలనాగును.) కాదు. కాదు. అది అసంభవము.

దాసి—(చెట్టును పట్టుకొనివచ్చి) అమ్మా! దీన్ని ఎక్కడపెట్టమన్నారు ?

నోరా—ఇదిగో. ఇక్కడ ఈమధ్యను.

దాసి—అమ్మా! మరేమైనా తెచ్చేదా ?

నోరా—అక్కరలేదు. అక్కరలేదు. అన్నీవున్నాయి.

(దాసి నిష్క్రమించును.)

నోరా—(వృక్షము నలంకరింప ప్రారంభించును.) ఇక్కడొక కొవ్వొత్తి—ఇక్కడ పువ్వులు—ఆ చండాలం మనిషి ! అదంతా వుత్తి తెలివితక్కువ—అందులో మరేం తప్పులేదు. చెట్టు చాల అందంగానుంది. నేను చెయ్యగలసిందంతా చేస్తాను. నా ప్రాణేశ్వరుడు చాలసంతోషిస్తాడు—మీకోసం నేను పాడతాను, నృత్యం చేసాను—

(చంకలో కొన్ని కాగితములుపెట్టుకొని హెల్మరు ప్రవేశించును.) అప్పుడే మీరు వెళిపోవచ్చారా ?

హెల్మరు—అవును. ఇక్కడ కెవరైనా వచ్చారా ?

నోరా—ఇక్కడకా ? లేదు.

హెల్మరు—చాల తమాషాగానుంది. క్రోగ్‌స్టాడ్ ఇంట్లోంచి వెళ్లడం చూశాను.

నోరా—మీరు చూశారా ? అవునవును. నేను మరచిపోయాను. అత డిక్క డొక్క క్షణముండి వెళ్లాడు.

హెల్మరు—నోరా ! నీమొగంచూస్తే అత డేదో శిఫారసు చెయ్యమని నిన్ను బ్రతిమాలినట్టు నాకు కనబడుతున్నాది.

నోరా—అవును.

హెల్మరు—నీమట్టుకు నువ్వే చెయ్యాలనే వుద్దేశంతో కనబడుతున్నావు. అతడు వచ్చినసంగతి నాదగ్గర నువ్వు మభ్య పరచావు. అది నిన్నతడు కోరలేదా ?

నోరా—కోరాడు. కాని నాధా—

హెల్మరు—నోరా ! నోరా ! అటువంటివనికి నువ్వు కార్యభారం పూనుకుంటున్నావు ? అలాంటివాడితో మాట్లాడడము, వాని కలాంటి వాగ్దత్తము చెయ్యడము, ఈబేరానికి మధ్య నసత్యమాడడము.

నోరా—అసత్యమా—?

హెల్మరు—ఇక్కడి కెవ్వరు రావడము లేదని నువ్వు చెప్పడము లేదు. (ఆమెను వ్రేలితోటి తాటిస్తూ) నావసంతకోకిలా! మళ్లీ అలాగు చెప్పకూడదు. పలుకడానికి నావసంతకోకిలకు నిర్మలమైన ముక్కుండాలి—అపశ్రుతులు పలుకకూడదు. (తన చేతితో నామెకటిప్రదేశమును చుట్టును) ఇప్పుడు బాగుంది కాదూ? అవునిప్పుడు బాగుంది. (ఆమెను విడిచి పెట్టును.) దానిని గురించి మరి ప్రసంగించవద్దు. (స్టవ్వు ప్రక్కను కూర్చొనును.) ఇక్కడెంత వెచ్చగాను హాయిగాను వుందో! (కాగితములు చూచుచుండును.)

నోరా—(క్రిస్టమస్ వృక్షము నలంకరిస్తూ కొంతసేపూరుకొని) నాథా!

హెల్మరు—ఏమి?

నోరా—ఎల్లుండి స్టెన్బర్గువద్ద జరిగే నర్తన ప్రదర్శనమునకై నేనెదురు చూస్తున్నాను.

హెల్మరు—ఆనాడు నువ్వు మమ్మ నేలాగు ఆనందాద్భుతరసాల్లో ముంచేస్తావో అని ఉత్కంఠతో నెదురు చూస్తున్నాము.

నోరా—నేనేం చెయ్యడానికి ప్రయత్నించినా తెలివి తక్కువే.

హెల్మరు—నువ్వన్నది నాకేమి బోధపడలేదు.

నోరా—మీకు వినోదింప జేసేది నేనేమిచెయ్యలేను. నేను తలచినదంతా స్వల్పంగాను తెలివితక్కువగాను కనిపిస్తున్నాది.

హెల్మరు—నాముద్దు నోరా! ఆమాట కడపటి కొప్పుకున్నదా ?

నోరా—(అతని కుర్చీ వెనక నిలబడి దాని వీపుమీద తన చేతులు పెట్టి) నాధా ! మీకు తీరిక లేదా ?

హెల్మరు—ఆఁ, ఆఁ—

నోరా—ఆకాగితము లన్నీ యేమిటి ?

హెల్మరు—బ్యాంకీవ్యవహారము.

నోరా—అప్పుడే ?

హెల్మరు— కచేరిలోను, ఉద్యోగస్థులలోను తగిన మార్పులు చేసి కావలసిన యేర్పాటులు చెయ్యవలసినదని మేనేజరుగారి వద్దనుండి హుకుము వచ్చింది. ఈ క్రిష్టమస్సువారం రోజులూ దాని క్రింద వుపయోగిస్తే కొత్తసంవత్సరాది వచ్చేసరికి అంతా సిద్ధమవుతుంది.

నోరా—అందుకనే పాపం క్రోగ్‌స్టాడ్—

హెల్మరు—హుః

నోరా—(అతని కుర్చీపై వెనుకనుండి చేరబడి చేతితో నతని తల దువ్వును.) మీకేమైనా తీరికవుంటే మిమ్మల్ని నేనొక గొప్ప బహుమానం అడుగుదా మనుకుంటున్నాను.

హెల్మరు—ఏమిటది ? చెప్పు.

నోరా—మీకున్నంత అభిరుచి యెవరికీలేదు. కాబట్టి యెల్లుండి జరిగేప్రదర్శనములో నాకు అందమైన దుస్తులతో కనబడాలనివుంది- కాబట్టి నాథా! ఏదుస్తులు ధరించాలో, ఏవేషంలో అక్కడకు వెళ్లాలో మీరాలోచించి యేర్పాటు చెయ్యరూ ?

హెల్మరు—ఆహా! కడపట నాతలతిక్క చిన్నది యెవరిసహాయానికో యెదురుచూడవలసివచ్చింది.

నోరా—అవును. ప్రాణప్రియా! మీసహాయంలేకుండా నే నొక్కక్షణమైనా వేగలేను.

హెల్మరు—సరే. దానినిగురించి ఆలోచిస్తాను. ఏదైనా తగినది వేదాము.

నోరా—నామీద మీ కెంతదయ! (క్రిష్టమస్ వృక్షమువైపుపోయి ఒక్కక్షణ మూరకొనును.) ఈయెర్రపువ్వు లెంత అందముగా నున్నాయో!—కాని చెప్పండి. ఈక్రోగ్‌స్టాడ్ చేసినది అంత ఘోరమైన అపరాధమా ?

హెల్మరు—అతను కూట సంతకంచేశాడు. అదంటే నీకేమైనా తెలుసునా ?

నోరా—అతడలాగు చెయ్యకపోతే వీలులేకపోయుండకూడదా ?

హెల్మరు—అదీ అయ్యుండొచ్చును. లేకపోతే తక్కిన వాటిలాగ తెలివితక్కువచే చేసియుండవచ్చును. కాని ఒక్కతప్పుచేత ఖండించడానికి నే నంతకఠినహృదయుడను గాను.

నోరా—అవును. మీరలాగు చెయ్యరు. నాకు తెలియదా ?

హెల్మరు—వాడు తనతప్పునేదో ఒప్పుకుని శిక్షభరిస్తే వానినడవడి చక్కచేదామని చాలమంది అనుకున్నారు.

నోరా—శిక్షా—?

హెల్మరు—క్రోగ్స్టాడ్ అటువంటి దేమీ చెయ్యడం లేదు. ఏదోతంత్రంచేసి దానినుండి తప్పించుకున్నాడు. అందుచే తనే వాడలాగు చెడిపోతున్నాడు.

నోరా—కాని మీరది—?

హెల్మ—ఒక్కసారి ఆలోచించు. అటువంటి ద్రోహి ఎల్లాఅబద్ధమాడి, ఎలామోసంచేసి, తన ఆత్మీయులవద్ద ఎట్టికపటవేషం ధరించాడో—తనభార్యాపుత్రులవద్దకూడాను. ఇటువంటివానిపిల్లలో—ఇప్పుడదే కష్టసాధ్యమైన చిక్కువచ్చింది నోరా !

నోరా—ఎలాగు ?

హెల్మ—ఎందుచేతనంటే, ఆ అసత్యవాయువుందే ఇంటినంతటినీ విషపూరితంగా చేస్తుంది. పిల్లలు పీల్చినగాలి యావత్తు నామర్ఖజాలనే లోనికి గొనిపోతుంది.

నోరా—(కొంచెము దగ్గరకువచ్చి) నాథా! అది నిశ్చయమేనా?

హెల్మ—ప్రియా! నేను వకీలుగానున్నప్పుడు ఇలాంటివారి ననేకమందిని చూశాను. ఇంచుమించుగా నందరు తమ దొంగతల్లులమూలాన్నే యిటువంటి దుర్మార్గవర్తనలోనికి మొదట దిగారు.

నోరా—మీరెందుకు—ఒక్కతల్లులనే చెప్తారు?

హెల్మ—అప్పుడప్పుడూ దుష్ప్రవర్తన గలిగిన తండ్రిమూలాన్నిగూడా పిల్లలు చెడిపోతూవున్నా, సాధారణంగా నిది తల్లుల ప్రభావమే. ఈసంగతి ప్రతీవకీలుకు తెలుసును. క్రోగ్స్టాడ్ తనపిల్లలకు సంతతము అసత్యములను కుతంత్రములను మప్పి చెడగొడుతున్నాడు. అందుకనే వానికేమి శీలము లేదని నేను చెప్పుతున్నాను. (ఆమెవైపు చెయ్యిచాచి) అందుకనే నాముద్దులనోరా వానిగూర్చి యేమిచెప్పనని వాగ్దత్తము చెయ్యాలి. అలాగని నువ్వు ప్రమాణంచెయ్యాలి. రా. రా. ఏమిటిది? ఏదీ నీచెయ్యియ్యి, అదిగో అంతా తేలిపోయింది. అటువంటివాళ్ల మధ్య నున్నప్పుడునాకు చికాకుగా గూడావుంటుంది.

నోరా—(అతనిచేతిలోనుండి చెయ్యితప్పించుకొని అతని కెదురుగా క్రిస్టమస్‌వృక్షము ప్రక్కకరుగును.) ఇక్కడెంతవేడిగానుంది! నే నెంతపని చెయ్యవలసివుంది!

హెల్మ—(నిలబడి తనకాగితములను సరీగాసర్దుకొని) అవును. నేను భోజనానికి పూర్వము వీటినన్నిటినీ యెలాగైనా చూడాలి. నీదుస్తులను గురించికూడా ఆలోచించాలి. చేట్టునకు ముచ్చికాగితములతో వ్రేలగట్టడానికి నాదగ్గరేమైనా వుంటుందేమో. (తనచేతి నామె తలపైనుంచి) నాముద్దులవసంతకోకిలా! (అతడు తనగదిలోనికి పోయి తలుపును మూసివేయును.)

నోరా—(కొంతసేపూరుకొని తనలో గొణుగుకొనును) లేదు, లేదు—అది సత్యంకాదు. అలాగు జరగదు. అలాగు జరక్కూడదు—(దాది ఎడమప్రక్కనున్న తలుపు తీసి.)

దాది—అమ్మా! పిల్లలు అమ్మదగ్గరకు తీసుకువెళ్లమని అల్లరపెడుతున్నారు.

నోరా—ఒద్దొద్దు, వారిని నాదగ్గరకు రానివ్వకు. ఏనీ! నువ్వు వాళ్లనాడించు.

దాది—సరేనమ్మా! (తలుపుమూయును.)

నోరా—(భయముచే పాలిపోయి) నాబిడ్డలను పాడుచేస్తానా? నాగృహాన్ని విషపూరితంచేస్తానా? (కొంతసేపూరుకొని తలనెగురవేసి) అది నిజంకాదు. అది నిజమయ్యేందుకు.

ఇది ప్రథమాంకము.

# బొమ్మరిల్లు.

## ద్వితీయాంకము.

### రంగము.

[ప్యానోప్రక్కనొకమూలను క్రిస్టమస్ వృక్షముండును. అది నిరస్తభూషయై యుండును. చీరాడుతున్న దాని కొమ్మల నుండి కాలినక్రొవ్వొత్తులు వ్రేలబడియుండును. నోరా దుస్తులును టోపీయు సోఫాపై బడియుండును. సోఫాప్రక్క నాగి దుస్తులను తీయును.]

నోరా—(దుస్తులను క్రిందపారవైచి) ఎవరోవస్తున్నారు. (ద్వారమువద్దకుపోయి వినును) లేదు—ఎవరూ లేరు. ఇవాళెవరూ రారు. ఇవాళ క్రిస్మస్ దినము—రేపుకూడాను. కాని బహుశా—(తలుపుతెరచి పైకిచూచును.) లేదు. ఉత్తరాలపెట్టెలో నేమీ లేదు. అది కాళీగానే వుంది. (ముందునకు వచ్చి) ఏం వెధవఘోష. అతడు మనఃపూర్తిగా అనుండడు. అలాంటిది జరగదు. అది అసంభవము. నాకు ముగ్గురు పిల్లలున్నారు.

[ఒకపెద్ద అట్టపెట్టె పట్టుకుని ఎడమవైపునుండి
దాది ప్రవేశించును.]

దాది—ఆఖరుకు మీక్రొత్తవస్తువులపెట్టె దొరికింది.

నోరా—సరే. ఆమేజామీద పెట్టు.

దాది—(అలాగేచేస్తూ) కాని, అమ్మా! అది చాలవు ట్టుకు కట్టవలసుంది.

నోరా—దాన్ని నూరువేలముక్కలుగా చింపేస్తే బాగుండును.

దాది—అదేమ్మాటమ్మా! అది సుళువుగా సరిచెయ్యొచ్చు. ఒక్కపిస రోపికుంటేసరి.

నోరా—సరే. నాకు సాయంచెయ్యడానికి నేను వెళ్లి లిండీదేవిని పిలుస్తాను.

దాది—ఏమిటిది? మళ్లీ వీధిలోకే? ఈభయంకరమైన ఓరు గాలిలో? అమ్మా! మీకు శైత్యంచేస్తుంది. రోగం తెచ్చుకుంటారు.

నోరా—అంతకంటె వుపద్రవమే జరుగవచ్చు. పిల్లలెలా గున్నారు?

దాది—పాపం. వాళ్లు క్రిష్టమస్‌బహుమతులు పెట్టుకుని ఆడుకుంటున్నారు. కాని—

నోరా—నాకోసంగాని యేడుస్తున్నారా?

దాది—మరి వాళ్లమ్మతోనే వాళ్లెప్పుడూ వుండడం అలవాటు.

నోరా—అవును. గాని, ఏనీ! నాకు పూర్వంలాగ వాళ్లతో నుండడానికి తీరుబాటులేదు.

దాది—ఫరవాలేదులెండి. చిన్నపిల్లలు దేనికైనా సులువుగా అలవాటు పడిపోతారు.

నోరా—నిశ్చయమేనా? అమ్మ కనబడకుండా వెళిపోతే వాళ్లు మరచిపోతారా ?

దాది—అయ్యో రామ! కనబడకుండానా ?

నోరా—ఏనీ! నీకొకమాట అడగాలనుంది. దాని గూర్చి నేను తరచు ఆశ్చర్యపడుతుండేదాన్ని. పరాయివాళ్ల మధ్యను నీచిన్నిబిడ్డను వదలేడానికి నీమనస్సెలాగొప్పింది ?

దాది—ఏమి? దానివల్ల నింతమంచిస్థితికి వస్తూవుంటే ? కష్టాలపాలైనచిన్నపిల్ల కిది సంతోషంకాదా? అదికాక, ఆదుర్మార్గుడు నాకొకపిసరైన సహాయం చెయ్యలేదు.

నోరా—బహుశా నీకూతురు నిన్ను మరచిపోయుంటుంది.

దాది—లేదమ్మా! మరచిపోలేదు. ఆమెకు పని ఖాయమైనప్పుడు, ఆమె వివాహమైనప్పుడుగూడా నాకుత్తరాలు వ్రాసింది.

నోరా—(తన రెండుచేతులతో నామె కంఠమును కౌగిలించుకొని) ఏనీ ! నాచిన్నతనంలో నువ్వే నాప్రియ మాతవు.

దాది—పాపము నాముద్దులనోరాతల్లికి నేనుతప్ప మరి తల్లి లేదు.

నోరా—నాబిడ్డలకుగూడా తల్లి లేకపోయినప్పుడు నువ్వే తల్లివిగా నుంటావు—నేను మాట్లాడుతున్న దెంత అసందర్భంగానుంది. (పెట్టెతెరచి) నువ్వు పిల్లలదగ్గిరకు వెళ్లు. నేను రేపెంత అందంగానుంటానో నువ్వు చూద్దుగాని.

దాది—రే పాత్రప్రదర్శనంవద్ద మీకంటే యెవరూ అందంగానుండరమ్మా. (ఎడమవైపునున్న గదిలోనికి పోవును.)

నోరా—(పెట్టెలోని వస్తువులను విప్పమొదలుపెట్టును. కాని వెంటనే మరల వానిని దూరము త్రోసివేయును.) నేను వెళిపోగలసినట్టయితే నాతో నెవరూ రాకుండావుంటే యీ మధ్యను ఇక్కడేమి విపరీతం జరగకుండా వుంటే అసందర్భము. తెలివితక్కువ. ఎవరూ రారు. నేను దాన్నిగురించి మాత్రం తలచుకోకూడదు. నామాంద్యాన్ని వదలుకోవాలి. ఎంతఅందమైన కరత్రాణములో ! ఆఆలోచన మానుకోవాలి. ఒకటి, రెండు, మూడు, నాల్గు, ఐదు, ఆరు (అరచును.) ఆ ! ఎవరో వస్తున్నారు—(ద్వారమువద్దకు పోవును. కాని అనాలోచితముగ్గా నక్కడ నిలబడును.)

[ప్రవేశము:—లిండీదేవి సావడిగుండాఁ
సావడిలో తనదుస్తులను టోపీతీసి ఆమె వుంచును.]

నోరా—ఓహో! నువ్వా నాక్రిస్టినీ? ఆప్టైని ఎవరూ లేరుగదా? నువ్వురావడం ఎంత మంచిపనిచేశావు?

లిండీ—ఇప్పుడే నువ్వు నాగురించి అడుగుతున్నావట.

నోరా—అవును. నువ్వు నాకుకొంచెం సాయంచెయ్యాలి. ఈసోఫామీద కూర్చుందాం రా. విను. రేపు స్టెన్బర్గులో నర్తనప్రదర్శనం జరుగుతుంది. నాభర్తగారు నన్ను నేపాలదేశపు చేపలదానివేషం వేసుకొని, కేప్రీలో నేను నేర్చుకున్న టరన్టల్లా నృత్యం చెయ్యమని కోరుతున్నారు.

లిండీ—అలాగా, అయితే నువ్వావేషం వేస్తావన్నమాట.

నోరా—అవును. నాభర్తగారు కోరుతున్నారు. ఈ దుస్తులు చూడు. మాఆయన నాకోసం కుట్టించారు; కాని,అదంతా చిరిగిపోవడంచేత, ఏలాగుండాలో నాకు బోధపడలేదు.

లిండీ—మనం సులువుగా దాన్నిసరిచేసేస్తాము. ఇక్కడా అక్కడా కొన్నిటక్కులువెయ్యడం మరిచిపోయాడు. సూదీ దారంయేదీ? అప్పుడప్పుడు మనకు కావలసిందంతే.

నోరా—నువ్వెంతమంచిదానివే.

లిండీ—(కుడుతూ) రేపు నువ్వు ఈదుస్తులను వేసుకుంటావుగదూ. నోరా! ఎలాగో నేను చెప్పాను—నే నొకసారి

యీనూతాన్నంబరముల్లో నువ్వేలాగున్నావో చూస్తాను. కాని నిన్నసాయంత్రం నువ్వుచేసినమేలునకు నేను వందనములుచెయ్యడం మరచిపోయాను.

నోరా—(నిలబడి రంగమునకడ్డుగానడచి) నిన్నరోజూలాగ అంతహాయిగా లేను. క్రిస్టెనీ! నువ్వింతకంటె కొంచెం ముందురావలసింది. నాభర్తకు ఇల్లుశుభ్రంగాను, అందంగాను ఎలాగుంచడమో తెలుసును.

లిండీ—నువ్వుకూడా ఆలాగే వుస్తావు. నాకు తెలుసును. నీతండ్రికి నువ్వు కూతురైనందుకు వృథాకాలేదు. కాని చెప్పు. ఈడాక్టరు నిన్ననున్నట్టే యెప్పుడూ క్రుంగిపోయేవుంటాడా ?

నోరా—లేదు. నిన్ననతనిముఖంలో అది ప్రత్యక్షంగా కనబడ్డాది. అతడుచాల ఉపద్రవమైన జబ్బుతో బాధపడుతున్నాడు. పాపం! అతనికి క్షయరోగం పట్టుకుంది. అతనితండ్రి అన్నిటిలోను అమితంగానే వుండేవాడు. అందుచేతనే అతనికొడుకు పుట్టిందగ్గరనుండి రోగిష్టిగానే వున్నాడు. తెలిసిందా?—

లిండీ—(కుట్టునాపివేసి) కాని నాముద్దులనోరా! అతనిగురించి యిదంతా నీకెలాగు తెలిసింది?

నోరా—(ఇటునటునడుస్తూ) ముగ్గురుపిల్లలను కన్నతరువాత నన్ను చూడ్డానికి యెవరైనా వస్తూవుంటూరు; భర్తలతో కాపురంచేస్తున్నవాళ్ళు. వాళ్లలో కొంతమంది వైద్యం తెలిసినవాళ్లు. ఇటువంటిసంగతులన్నీ ఒకటితరువాత నొకటి మాట్లాడతారు.

లిండీ—(కుట్టుతూ ఒక్క క్షణమూరుకొని) డాక్టరురాంక్ ఇక్కడకు రోజూ వస్తూవుంటాడా?

నోరా—ప్రతిరోజూ తప్పకుండా. అతడు నాభర్తకతి ముఖ్యస్నేహితుడు. నాకుకూడాను. అతడు మాకుటుంబంలో వానిలాగేవుంటాడు.

లిండీ—కాని, చెప్పు - అతడు మంచివాడేనా? అంటే ప్రతీవాళ్లతోనూ ఎలాగో బుజం కలిపీడానికి తొందపడేవాడౌనా కాదా?

నోరా—అబ్బే. అలాగెందుకన్నావు?

లిండీ—నిన్న నతనిపరిచయం నాకు మొదట కలిగినప్పుడు నాపే రనేకసార్లు ఈయింట్లోవిన్నానని అతడు చెప్పేడు. కాని నీభర్త నేనెవరో ఒకపిసరైనా తెలియదన్నాడు. అందుచే డాక్టరురాంకుకు—

నోరా—అదినిజమే క్రిస్టైనీ! నాభర్తగారు నన్నెంతో ప్రేమిస్తారు. అందుచేతవారికి నావూసుతప్ప యింకొకరివూసక్కరలేదు. నేను వచ్చినకొత్తరికం నాప్రియసఖులనుగూర్చి మాట్లాడేదాన్ని. దానికాయన యేవగించుకొనేవారు. అంతట నుండి నేనాప్రస్తావన మానేశాను. కాని యిటువంటివి వినడానికి డాక్టరురాంక్ గారి కిష్టం కాబట్టి అతనితో నే నిటువంటివన్నీ మాటాడుతూవుంటాను.

లిండీ—నోరా! నువ్వింకా అనేకవిషయాల్లో పసిదాన వు. అనేకవిధాల నేను నీకంటే పెద్దదాన్ని, ఎక్కువఅనుభవం కలదాన్ని. కాబట్టి నేనొకమాట చెప్తాను విను—డాక్టర్ రాంకుతో స్నేహం చాలించడం మంచిది.

నోరా—ఏమిటి? నే నతనితో స్నేహంచాలించాలా?

లిండీ—రెండుకారణాలచేత, నిన్న నువ్వేదో అసందర్భ ప్రలాపం గావించావు. నిన్నెవ్వడో ధనవంతుడు మోహించి మరణశాసనమూలముగా నీకు ద్రవ్యమిచ్చినట్టు—

నోరా—భగవదనుగ్రహంవల్ల అట్టిప్రియుడు నిజంగా ఎవడూలేడు. కాని, తరవాత ?

లిండీ—డాక్టరునకేమైనా ఆస్తివుందా ?

నోరా—ఆఁ, ఉన్నాది.

లిండీ—అతనికెవరు దక్షతగాని, వారసులుగాని లేరు గదూ ?

నోరా—లేరు. లేరుకాని—

లిండీ—ప్రతిరోజు ఇక్కడకేవస్తాడు ?

నోరా—అవును. ఆసంగతి నేనే చెప్పాను.

లిండీ—అయితే యీపెద్దమనిషి అంతగడుస్తనం లేని వాడా ?

నోరా—నువ్వన్నమాట నాకేమి బోధపడలేదు.

లిండీ—తెలియనట్టు నటించకు నోరా! నీకా రెండువంద లయాభైపౌను లెవరిచ్చారో నాకు తెలియదనుకున్నావా ?

నోరా—నీకేం మతిపోయిందా ? అతడిచ్చాడని నువ్వె లాగనుకున్నావు ? ఇచ్చటికి రోజూ వస్తున్న స్నేహితుడు. అతని వద్ద నప్పు తీసుకోవడం ఎంతకష్టంగా నుంటుందో నువ్వేమైనా ఆలోచించావా ?

లిండీ—అయితే అతడు కాడా?

నోరా—కాడు. కాడు. ఆ ఆలోచన ఒక్కక్షణమైనా నాతలపునకు రాలేదు. అదిగాక నాకివ్వడాని కతనివద్ద నప్పటికి డబ్బులేదు. అతనికీఆస్తి తరవాతకలసింది.

లిండీ—సరే. నోరా! నువ్వు చాల అదృష్టవంతు రాలవు.

నోరా—లేదు. డాక్టరురాంకును అడుగుదామనుకో లేదు. నే నడిగినట్టైతే అతడు తప్పకుండా—

లిండీ—కాని నువ్వడగలేదు ?

నోరా—అడగలేదు. అలాగు అడగడానికి వీలవుతుంద నిగూడా నేననుకోలేదు. కాని, నేను డాక్టరురాంక్‌తో చెప్పి నట్టైతే అతడుతప్పకుండా—

లిండీ—నీభర్తపరోక్షంగానా ?

నోరా—అలాగైతే అతనితోఅంతా తెగతెంపులు చేసికోవలసివుంటుంది.

లిండీ—అవునదే నీకు నిన్న చెప్పినది. కాని—

నోరా—(ముందుకూ వెనక్కూ నడుస్తూ) పురుషుడు స్త్రీకంటే యిటువంటి కార్యాలు సులువుగా నెరవేరుస్తాడు.

లిండీ—భర్తయితేనా ? అవును.

నోరా—చాచా (కదలకుండానిలబడి) నువ్వుతెచ్చిన అప్పు చెల్లించేస్తే నీపత్రం నీకుతిరిగి వెళిపోవస్తుందికాదూ ?

లిండీ—దానిమట్టుకదే.

నోరా—అంత ఆవెధవకాగితాన్ని ముక్కముక్కలు గా చింపేసి కాల్చివచ్చును.

లిండీ—(ఆమెవైపుతీక్ష్ణంగాచూచి కుట్టుతున్నది క్రింద పెట్టి మెల్లగాలేచి) నోరా ! నువ్వేదో నావద్దనుండి మభ్యపరుస్తున్నావు.

నోరా—నేను దాచినట్టు కనబడుతున్నానా ?

లిండీ—నిన్న ప్రాతఃకాలం గడచినతరవాత నీకేదో జరిగింది. నోరా ! ఏమిటది ?

నోరా---(ఆమెదగ్గరకువెళ్లి) క్రిస్టైనీ ! (వినుటనభినయించి) ఊరుకో ! ఊరుకో ! నాభర్తగారింటికి వస్తున్నారు. నీకు లోపలకువెళ్లి పిల్లలను చూదామనుందా? నాభర్తకు బట్టలు కుట్టుకుంటూ వుండడం సహించదు. ఏనీకూడా కొంచెం సాయం చేస్తుంది.

లిండే---(వస్తువులనుపోగుచేసి) అలాగే. కాని నీదగ్గర నుండి, ఆసంగతి తేలిందాకా వెళ్ళను. (ఎడమవైపునున్నగదిలోనికి పోవును. హెల్మరు సావిడిగుండా వచ్చును.)

నోరా—(అతనిదగ్గరకువెళ్ళి) మీకోసం ఎంతో ఎదురు చూస్తున్నాను నాథా !

హెల్మ—ఎవరది. కుట్టుపనిదా ?

నోరా—కాదు, క్రిస్టెనీ. ఆవిడ నావస్త్రులు సరిగా కూరుస్తున్నాది. నే నెలాగుకనబడతానో మీరే చూస్తారు.

హెల్మ—అదియెంతో సంతోషమైనసంగతి.

నోరా—బాగు బాగు. మీరు కోరినట్టు చెయ్యడం నాకు కూడ ఆనందంకాదా ?

హెల్మ—ఆనందమా ? నీభర్త కోరినట్టు చేసినందుకా ? నువ్వన్నమాట నిజమేనా ? కాని నిన్ను నే నల్లరపెట్టను. దుస్తులు తొడుక్కొని చూద్దామని నీకుందిగదూ ?

నోరా—మీరు పని చూచుకోడానికి వెళ్ళిపోతారు కాబోలు ?

హెల్మ—అవును. (కాగితములకట్టను చూపును.) ఇది చూడు. నే నిప్పుడే బాంకికి వెళ్ళివచ్చాను. (తనగదివైపు తిరుగును.)

నోరా—నాథా !

హెల్మ—ఓయి !

నోరా—మీముద్దులవుడుత మిమ్మల నేదైనా చాల చాల అందమైనదాన్ని అడిగితే—

హెల్మ—ఏమిటది ?

నోరా—మీ రిస్తారా ?

హెల్మ—అదేదో నేను ముందువినాలి.

నోరా—మీరు దయుంచి దానికి కావలసినదిస్తే, మీ ముద్దులవుడత యిటునటు పరుగెత్తి అనేకవిద్దెలు చేస్తుంది.

హెల్మ—అదేదో సరిగా చెప్పు.

నోరా—మీభరతపక్షి కిలకిలలాడుతూ ఆరోహణావరోహణములతో తనసంగీతం నెరుపుతుంది—

హెల్మ—నాభరతపక్షి అదెలాగుచేస్తుంది !

నోరా—నే నప్సరసవేషంవేసి మీకోసం వెన్నెలలో నృత్యం చేస్తాను నాథా !

హెల్మ—నోరా ! నువ్వుదయం చేసినప్రార్థన కాదు గదా ?

నోరా—(అతనిదగ్గరకు వెళ్ళి) అదేను. నానాథా ! మిమ్మలను నేను మిక్కిలి ప్రార్థిస్తున్నాను.

హెల్మ—తిరిగీ ఆప్రస్తావన తేవడానికి నీకు ధైర్యమున్నదా ?

నోరా—ఉంది. నేను కోరినట్లు మీరు చెయ్యండి. క్రోగ్స్టాడ్‌ను పనిలో నుండనియ్యండి.

హెల్మ—ప్రియా! నోరా! నే నతనిపనే లిండీదేవికి వచ్చేటట్టు యేర్పాటుచేశాను.

నోరా—అవును. ఆవిషయంలో మీరు చాల దయ చూపించారు. కాని క్రోగ్స్టాడ్నుతప్ప మరెవరినైనా పనిలో నుండి తప్పించియ్యండి.

హెల్మ—ఇది భరింపరాని మిక్కిలి మొండితనము. ఏదో ఒక అనాలోచితమైన వాగ్దత్తమును నువ్వు చేశావని వానిగూర్చి చెప్పుతున్నావు. నేనుకూడా—

నోరా—అదికాదు నాథా! ఈచెప్పుతున్నది మీకోసమే. వా డతిదారుణంగా పత్రికలలో వ్రాస్తాడు. ఆసంగతి మీరే చెప్పారు. మీకు చెప్పరానంత కీడుచేస్తాడు. అందుచేతనే అతడంటే నాకు బ్రహ్మాండమైనభయం—

హెల్మ—ఆహా! నాకు బోధపడింది. జరిగినదంతా జ్ఞాపకానికి వచ్చి నీకు భయంవేస్తున్నాది.

నోరా—ఏమిటి జ్ఞాపకానికిరావడం?

హెల్మ—నువ్వు మీతండ్రిసంగతి తలచుకుంటున్నావు.

నోరా—అవునవును. ఆసంగతొకసారి జ్ఞాపకంతెచ్చుకోండి. ఈ అసూయాపరులు అప్పగారినిగూర్చి పత్రికలో ఏమిటి వ్రాశారో, ఎంత అప్రతిష్ఠకలుగజేశారో, ఆసమయంలో ఆశాఖవారు మిమ్మల్ని పంపకపోయినా, మీరు దయదలచి ఆతనికి సహాయముచెయ్యకపోయినా అప్పు డతనికి బర్తరుఫు కూడా అయిపోయుండును.

హెల్మ—కాని నా ముద్దులనోరా ! మీఅప్పగారికీ నాకున్న ఒక ముఖ్యమైనభేదముంది. ఉద్యోగరీత్యా అతనివర్త నలో కొన్ని దోసగులున్నాయి. నాదలాగుకాదు. ఇకముందు కాబోదు.

నోరా—ఈద్రోహలు లెటువంటివన్నాగాలు పన్నుతారో మీరేంచెప్పగలరు. మన కీగృహకృత్యాల్లో అంతా సదుపాయంగాను, సౌఖ్యంగాను, ఏంవిచారంలేకుండా వుండాలి. మనకు పిల్లలుగూడా వున్నారు. అందుకనే మిమ్మింతగా ప్రార్థిస్తున్నాను.

హెల్మ—వానికోసం నువ్వనవసరంగా జోక్యంచేసుకుని చెప్పడం, వానిని నేను మరుంచడానికి వీలులేకుండా చేస్తున్నావు. అప్పుడే బాంకీవుద్యోగస్థులలో నేను క్రోగ్‌స్టాడ్ ను బర్తరుపు చేస్తున్నానని తెలిసింది. ఇప్పుడది మానేస్తే యేమంటారు. క్రొత్తమేనేజరు తనభార్యా ఆజ్ఞప్రకారం తనవుద్దేశం మార్చుకున్నాడు-

నోరా—అనుకుంటే యేంనష్టం ?

హెల్మ—ఏమీలేదు- నీలాంటి మొండివాళ్ళమాటు చెల్లితేసరి- నలుగురిముందరా నేను నవ్వులాల పాలవుతానను కున్నావా ? "ఎవరుచెప్పినాసరే వింటాడురా" అని ప్రజ లనుకోడానికి. దాని ప్రతిఫలంకూడా నేను వెంటనే అనుభవిస్తాను. అదిగాక నేను బాంకీలో మేనేజరుగా నున్నంతకాలం వానితో కలిసి పనిచెయ్యడానికి వీలులేకుండా మరొకకారణముంది.

నోరా—ఏమిటది ?

హెల్మ—పోనీ వాని నైతికదురాచారాలను వీలైతే పరిగణింపకపోవచ్చును.

నోరా—అవును. అలాగే.

హెల్మ—వాడు పనిబాగా తెలిసినవాడుకూడాను. కాని మేమిద్దరము బాలురగా నున్నప్పటినుండి వాణ్ని నే నెరుగుదును. వాని మోటస్నేహమే నాకొక పిశాచంలాగ కనిపిస్తుంది. నే నున్నసంగతి నీకు చెప్పేస్తాను. మే మొకప్పుడు మిక్కిలిస్నేహంగా నుండేవాళ్లము. కాని,యీ తెలివిమాలినవాడు నలుగురుఉన్నప్పుడైనా ఒకపిసరు కట్టుదిట్టముగా నుండడు. అదిగాక నాతో చనువుగా మాట్లాడడాని కొక హక్కున్నదని ప్రతీక్షణం "ఒరేహెల్మరు."అని యిలాగ్గాపిలుస్తాడు. అదినాకు చాలకష్టతరంగా నుంటుంది. బాంకీలో నాస్థితి దౌర్భాగ్యకరంగా చేస్తున్నాడు.

నోరా—మీ రలాగంటారని నేననుకోను.

హెల్మ—అనుకోవు ? ఎందుచేత ?

నోరా—అలాగుతలవడం సంకుచితబుద్ధిని తెలియజేస్తుందిగాబట్టి.

హెల్మ—ఏమిటంటున్నావు ? సంకుచితబుద్ధా ? నాది సంకుచితబుద్ధనా అంటున్నావు ?

నోరా—కాదు. మీదట్టిదికాదు. ప్రియా—అందుచేతనే.

హెల్మ—రెండూ వకటే. నేనుచెప్పినది సంకుచితదృష్టంటున్నావు. అయితే నాది సంకుచితబుద్ధి. సరే—ఇటువంటి దాన్ని తుదముట్టించాలి. (సావడిద్వారమువద్దకు పోయి పిలచును) హెలన్.

నోరా—నాథా! ఏమిటి చేస్తారు?

హెల్మ—(తనకాగితాలు చూస్తూ) అయిపోయింది,

[ప్రవేశము:—దాసి]

చూడు. ఈఉత్తరం తీసుకొని తత్క్షణమే క్రిందకు పో. అక్క డెవరినేనా మనిషినిచూచి వెంటనే తీసుకువెళ్లి యివ్వమని చెప్పు. వెళ్ళు, తొందరగా వెళ్ళు. పైవిలాసం దానిమీద వ్రాసివున్నాది. సొమ్మిదిగో.

దాసి—చిత్తము. (ఉత్తరము పట్టుకొని నిష్క్రమించును.)

హెల్మ—(కాగితములు సర్దుతూ) ఇప్పుడో నా చిన్నారి మొండీ!

నోరా—(అత్యాతురతతో) నాథా! ఏమిటది?

హెల్మ—క్రోగ్స్టాడ్ బర్తరుపు.

నోరా—నాథా! దాన్నిపిలవండి, ఇంకా కావలసినంత వేళుంది నాకోసం పిలవండీ—మీకోసం మనపిల్లలకోసం, విన్నారా? దాన్నిపిలవండి. ఆఉత్తరం మనకెంత వుపద్రవం తెస్తుందో మీకేం తెలుసు.

హెల్మ—మించిపోయింది.

నోరా—అవును. మించిపోయింది.

హెల్మ—నువ్వు పడుతున్న ఆందోళన నాకు తెలుసును. అది నాకు పరాభవమేనా, అవును. అది నాకు పరాభవమే. ఒక తిండిలేని గుమస్తాకోపానికి నేను జడవాలా? అయినా నిన్ను నేను క్షమించాను. దానివల్ల నీప్రేమ నాకు ప్రత్యక్షంగా కనబడుతున్నాది కాబట్టి. (ఆమె రెండుచేతులును పట్టుకొని) నాముద్దుల నోరా! ఇలాగుండాలి. ఏమివస్తే రానీ. దాన్ని ప్రతిఘటించడానికి నాకు పట్టుదల బలం కూడా వుంది. ఆపూచీ అంతా నానెత్తిమీద పెట్టుకోడానికి తగివున్నానో లేదో నీకే తెలుస్తుంది.

నోరా—(భీతిచే స్తంభించిన కంఠముతో) మీరన్నమాటేమిటి?

హెల్మ—నేను చెప్పినదంతా—

నోరా—(తెప్పరిల్లి) ఆలాగు మీరు చెయ్యలేరు.

హెల్మ—సరే. మంచిది. దాన్ని మనం భార్యాభర్తలులాగ పంచుకుందాం. అదే యిప్పుడు జరగాలి. (ఆలింగనం చేసుకుంటూ) ఇప్పుడు నీకు సంతోషమైందా. అదిగో. అదిగో. ఈచకితహరిణాక్షులు! ఇదంతా ఉత్తభయంకర స్వప్నము-నువ్వెళ్లి టరంటలా నృత్యము కంజరితో నభ్యాసం చెయ్యి. నేను కచేరీసావిట్లోకి పోయి తలుపు వేసుకుంటాను. నువ్వు

చేసిన చప్పుడు వినబడదులే. నీయిష్టంవచ్చినంత చప్పుడు చెయ్యి. (ద్వారంవైపు తిరుగును) రాంక్‌గాని వస్తే నే నెక్కడుంటానో చెప్పు. (తల నూచి కాగితములను తీసుకొని గది లోనికి పోయి తలుపు వేసుకొనును.)

నోరా—(ఆందోళనముచే తోచక, మొదలునరికిన వృక్షమువలె నొరిగి, గొణుగుకొనును.) వాడది చెయ్యడానికి సమర్ధుడు. అలాగు చేస్తాడు. ఎంత ప్రతికూలంగానున్నా చేస్తాడు- లేదు. అదికాదు. ఎన్నటికిన్నీ, ఎప్పటికిన్నీ, అదితప్ప యింకేదైనా సరే. ఏదయితే అదే. (ఆమె తనచేతుల రెండిటితోను ముఖమును కప్పుకొని లేచి ద్వారమువద్దకు పోయి తలుపు తెరచును. రాంక్ కోటు కొయ్యకు తగిలించి బయట నిలబడును. ఈక్రింది సంభాషణ జరుగుతూ వుండగా చీకటిపడును.)

నోరా—డాక్టరుగారు! బాగా మీపిలుపు వినబడ్డాది. కాని మీ రిప్పుడు టోర్వాల్డుగారి వద్దకు వెళ్ళవద్దు. ఆయన చాల పనితొందరలో వున్నట్టు కనిపిస్తుంది.

రాంక్—నువ్వో ?

నోరా—(అతన్ని లోనికి రావించి పిదప తలుపు మూయును.) నాకా? మీ రెప్పుడు వచ్చినా నాకు తీరుబాటే.

రాంక్—సరే. అయితే ఇక్కడే కాలక్షేపం చేద్దాము వీలైనంత.

నోరా—అంటే మీవుద్దేశ మేమిటి? వీలైనంతంటే ?

రాంక్—ఆమాట నీకు భయంవేసిందా ?

నోరా—మీరు చెప్పింది చాలా వింతగానుంది. ఏమైనా వుపద్రవం జరగబోతున్నాదా యేమి ?

రాంక్—క్రొత్తదేమీ లేదు. నేను చాలకాలంనుండి నిరీక్షిస్తున్నదే. కాని యింత త్వరగా జరుగుతుందనుకో లేదు.

నోరా—(అతని చేయి గట్టిగా పట్టుకొని) ఏమిటి కనుక్కున్నారు ? డాక్టరుగారు మీరు చెప్పాలి.

రాంక్—(స్టవ్వుప్రక్క కూర్చొని) అంతా నాసంగతే. ఇక మరేం చెయ్యడానికి లేదు.

నోరా—(ఉపశమనకరమైన ఒక నిట్టూర్పు పుచ్చి) మిమ్మునుగురించేనా ?

రాంక్—మరెవరికోరకు ? ఎవరిమట్టుకు వారూరుకోడం లాభంలేదు హెల్మరుదేవి. నాదగ్గర మందుపుచ్చుకున్న వాళ్ళందరికంటే కూడా నేనే దౌర్భాగ్యుణ్ణి. కొద్దిరోజులనుండి నే నింటివద్ద కొంచెంకూడికగా నున్నాను. అప్పులపుప్పి, బహుశా నేను నెలదాటకుండా చర్చి ఆవరణలో చివుతూ వుంటానేమో !

నోరా—ఎటువంటి వినరాని మాటచెప్పుతున్నారు.

రాంక్—అసలు కృత్యమే అసహ్యకరమైంది. అందులో వచ్చిన ముప్పేమిటంటే, అది రాకుండానే అంతకంటే అసహ్యకరమైనవాటితో ప్రతిఘటించవలసి వుటుంది. మరొక్కసారి

నామట్టుకు నేనే పరీక్షించుకుంటాను. అదయితే, ఎప్పటినుండి దుర్భరమైన నాచరమదశ ప్రారంభిస్తుందో తెలుస్తుంది. నీకో సంగతి చెప్పాలనుంది. హెల్మరు నవనాగరికత, అతనికి చూసిందల్లా అసహ్యం కలిగిస్తుంది. నాజబ్బుగదిలో అతనుండడం నాకిష్టం లేదు.

నోరా—అయ్యో ! కాని డాక్టరుగారు !

రాం—అతడుంటానన్నా ఉండనియ్యను. ఏకారణంచేతనైనాసరే అతను లోపలికి రాకుండా నాతలుపు వేసుకుంటాను. రావలసిందేదో పూర్తిగా వస్తుందని తెలిసినతరవాత నల్లని (శిలువ) అడ్డుగురుతుతో నీకొక వుత్తరం పంపిస్తాను. అప్పుడు నాకేదో తలపరానిది వచ్చిందని నువ్వనుకోవాలి.

నోరా—మీరు నేడుచాల అసందర్భంగా మాట్లాడుతున్నారు. మీరెంతో సరదాగా వుండాలని నేను కోరేను.

రాంక్—నామీద మృత్యువు తాండవిస్తూవుండగానా ? మరొకరిపాపానికి నేను ప్రతిఫలం అనుభవిస్తూవుండగానా ? అందులో నేమైనా న్యాయముందా ? ఏదో వొకలాగ తప్పింపరాని ప్రతిక్రియ జరుగుతునేవుంది—

నోరా—(తనచేతు లతనిచెవులమీద పెట్టి) అసందర్భం పోనివ్వురు. ఏదైనా సరదాఅయినసంగతి మాట్లాడండి.

రాంక్—ఓ. ఇదంతా నవ్వవలసినసంగతే. నావెన్నెముక నాజనకుని యౌవనానందముచే బాధపడవలసినదే.

నోరా—(ఎడమవైపు మేజాప్రక్కను కూర్చుని) అతనికి చిలకతోటకూరంటే యెంతో యిష్టం.

రాంక్—ముల్లంగంటే అంతకంటేను.

నోరా—అవును. ముల్లంగికూడాను. ఉల్లికోళ్లో ?

రాంక్—ఉల్లికోళ్లున్ను.

నోరా—తరవాత చందవలు.

రాంక్—చందవల మాట చెప్పనక్కరేలేదు.

నోరా—బుడ్లకోలది సారాయము ద్రాక్షారసముకూడాను. ఈమంచిమంచి సుగంధద్రవ్యాలన్నీ మనయెముకలమీద పగతీర్చుకుంటాయి.

రాంక్—ముఖ్యంగా వాని యనుభవ సంతృప్తిలేని నిర్భాగ్యుల యెముకలమీద.

నోరా—అదే విచారకరమైన సంగతి.

రాంక్—(ఆమెవంక తేరిపారజూచును) హుః.

నోరా—(కొంతసేపూరుకొని) మీరెందుకు నవ్వుతున్నారు ?

రాంక్—నేనుకాదు నువ్వేనవ్వుతున్నావు.

నోరా—నేనుకాదు. మీరే నవ్వుతున్నారు డాక్టరుగారు !

రాంక్—(నిలబడి) నేననుకంటెను నువ్వు మిక్కిలి పోకిరీదానివి.

నోరా—నా కీవేళ మిక్కిలి చికాకుగానున్నాది.

రాంక్—అలాగే కనబడుతున్నాది.

నోరా—(తనచేతులనతని భుజముపైనుంచి) డాక్టరు గారు! డాక్టరుగారు! మామధ్యనుండి మిమ్ము మృత్యువెత్తుకు పోకుండా వుండాలి.

రాంక్—ఆ నష్టం మిమ్ము నట్టేబాధించదు. చచ్చినవాళ్లను వేగం మరచిపోతారు.

నోరా—(అతనివైపు నాతురతతో చూచుచు) మీకు దానిలో నమ్మకముందా ?

రాంక్—మనుష్యులకు క్రొత్తబంధుత్వాలేర్పడతాయి. అప్పుడు—

నోరా—ఎవరి కేర్పడతాయి ?

రాంక్—నేను చచ్చిపోయినతరువాత నీవ్వు హెల్మరు కున్ను. నువ్వప్పుడే దారిలో పడ్డావు. నిన్నసాయంత్రం లిండీ దేవి యిక్కడ కెందుకు వచ్చింది ?

నోరా—ఓహో ! పాపం ! మీకాయనాధను, క్రిస్టైనీని చూస్తే అసూయగానుందా యేమి ?

రాంక్—అవును. ఆవిడే నా అనంతరం యీ యింటికి వారసురాలు. నేనుచచ్చిపోయినపిదప యీావిడ—

నోరా—ఊరుకోండి. అంతగట్టిగా మాట్లాడకండి. ప్రక్కగదిలోనే ఆమె వున్నాది.

రాంక్—ఈవేళమళ్లి న్నా ? చూశావా?

నోరా—ఆవిడ నాబట్టలు కుట్టడానికి వచ్చింది. చూశారా మీరెంత పొరపాటుపడ్డారో ? (సోఫామీద కూర్చొని) కాని డాక్టరుగారు! రేపు నేనెంతఅందంగా నృత్యంచేస్తానో మీరేచూస్తారు. ఇదంతా మీకోసం—మీస్నేహితులైన టోర్వాల్డుగారికోసం అనుకోండి. (మంజూషమునుండి వివిధవస్తుసముదాయమును తీస్తూ) డాక్టరుగారు! రండి కూర్చోండి మీకు కొన్నివస్తువులు చూపిస్తాను.

రాంక్—(కూర్చుని) ఏమిటవి ?

నోరా—వీటిని చూడండి.

రాంక్—పట్టుమేజోళ్లు.

నోరా—ఎర్రమంటిరంగు. ఏంబాగులేవూ ? ఇక్కడ చాల చీకటిగానుంది. కాని రేపు—లేదు. లేను. మీరు నాపాదాలతట్టే చూడాలి. సరే. మీరు కాళ్లవైపుగూడా చూడొచ్చు.

రాంక్—హుః—

నోరా—(ఒక్కక్షణమతనివైపు చూచి) సిగ్గు. సిగ్గు. (మేజోడుతో నతనిచెవిమీదకొట్టి) అదే మీకు శిక్ష. తిరిగీ వానిని మడతపెట్టును.)

రాంక్—ఇంకా ఎటువంటి మంచివస్తువులు నాకుచూపిస్తున్నావు ?

నోరా—ఆపెంకితనంచేసినందుకు మీకేమీ చూపించను. (తనలో కూనురాగముతీస్తూ వస్తువులవైపు చూచును.)

రాం—(కొంతసేపూరుకొని) నే నిక్కడకూర్చొని, మీతోనింతచనువుగా మాట్లాడుతున్నప్పుడు నే నిక్కడకు రాకపోతే నాసంగతి యేమైయుండునో నాకే తెలియదు.

నోరా—(నవ్వుతూ) మాతోనుంటే మీకెంతో కులాసాగానుంటుందనుకుంటాను.

రాంక్—(తిన్నగా ముందుకుచూస్తూ కొంచెముసన్నని స్వరములో) అంతా వదిలేసి పోవలసినప్పటికిని—

నోరా—అసందర్భం. మీరు దీన్ని విడిచిపెట్టలేరు.

రాం—(పూర్వమువలెనే) నాకృతజ్ఞత తెలుపుతూ, మీకోసమేమీ విడవలేకపోవడము, పశ్చాత్తాపమైనా సరే— ఇదంతా శుద్ధశూన్యం. ఒకరుపోయినపిదప మరొకరువచ్చి ఆక్రమించవచ్చు.

నోరా—మిమ్ము నేదైనాఅడిగితే—కాదు కాదు—

రాంక్—ఎందుకు ?

నోరా—మీస్నేహం తెలియజేసే పెద్దనిదర్శనంగా-

రాంక్—అలాగే. అడుగు.

నోరా—నాకేదైనా పెద్దఉపకృతి—

రాంక్—నన్ను నిశ్చయముగా నువ్వు సంతోషపెడుతున్నావా ?

నోరా—అయ్యో! అదింకా మీకు నిజంగా తెలియదా ?

రాంక్—తెలియదు. కాని చెప్పు.

నోరా—డాక్టరుగారు! నేను చెప్పలేను. అది అన్నిటిని అనుసరించి వుంటుంది. సలహా, సహాయము, ఉపకృతి.

రాంక్—వస్తువెంతపెద్దదైతే అంతమంచిది. నువ్వన్నదేదో నేను పోల్చుకోలేను. నాలో నీకు నమ్మకంలేదా ?

నోరా—అందరికంటే మీలోనే. మీరు నాకు ఆప్తులనిన్నీ, మంచిస్నేహితులనిన్నీ తెలుసును. అందుచేతనే మీకు చెప్పుతున్నాను. డాక్టరుగారు! మీరు ప్రస్తుతం ఆపదరాకుండా చెయ్యాలి. నన్ను టోర్వాల్డుగారింత గాఢంగా, నెంతవచనాతీతంగా ప్రేమిస్తున్నారో మీకే తెలుసును. నా గురించి వారి ప్రాణాన్నిగూడా విడవడానికి ఒక్కక్షణమైనా సంకోచింపరు.

రాంక్—(ఆమెవైపువంగి) నోరా! టోర్వాల్డు ఒక్కడే అనుకుంటున్నావా ?

నోరా—(కొంచె ములికిపడి) ఒక్కడేనా ?

రాంక్—నిన్నుగూర్చి ప్రాణమును త్యజించేవాడతడొక్కడేనా? అని.

నోరా—(విచారముతో) అదా మీరన్నది.

రాంక్—నేను వెళ్లిపోకమునుపు నీకది తెలియాలని నాకోరిక. ఇంతకంటే నాకు మరివేరే అవకాశంలేదు. నోరా! నీకది తెలుసును.

నోరా—(సాలోచనగా నెమ్మదిగాలేచును.) నన్ను వెళ్లిపోనియ్యండి.

రాంక్—(ఆమెపోవుటకు దారినిచ్చును. గాని నిశ్చలముగా కూర్చుండును.) నోరా!

నోరా—(సావిడితలుపువద్ద) హెలన్! దీపంపట్టుకురా! (స్టవ్వుదగ్గరకు పోవును.) డాక్టరుగారు మీరన్నదేం బాగు లేదు.

రాంక్—అందరూ ప్రేమించినట్టు నిన్ను ప్రేమించడమా? అది తప్పా?

నోరా—కాదు. కాని ఆసంగతి నాతో చెప్పడం దానికిప్పుడేమీా అవసరములేదు.

రాంక్—నువ్వన్నమాటేమిటి? నీ కిదివరకు తెలుసునా? (దాసి దీపముపట్టుకొని ప్రవేశించి, దానిని మేజామీాద పెట్టి వెడలిపోవును.) నోరా! హెల్మరుదేవి! చెప్పూపోనీ నీకది తెలుసునేమో!

నోరా—నాకు తెలిసిందీ లేనిదీ మీాకెలాగు తెలుసును. నేను చెప్పలేను. మీారింత అసందర్భముగా చెప్పడం డాక్టరుగారు! మనం ఎంతో చక్కగా మాట్లాడుకుంటూ వున్నాము.

రాంక్—సర్వకాలములంధూ నువ్వు నాదేహాన్ని ఆత్మ నుకూడా ఆజ్ఞాపింపగలవు. కాబట్టి చెప్పవు ?

నోరా—(అతనివైపుచూస్తూ) ఇందాకేమిటి చెప్పాను?

రాంక్—అదేమిటో తెలియదు. నాకుచెప్పు ?

నోరా—ఇప్పుడు మీకేమీ చెప్పలేను.

రాంక్—కాదు. కాదు. నువ్వు నన్నిలా శిక్షించగూడదు. నిన్నుగూర్చి మనిషి చెయ్యడానికి వీలైనదంతా చెయ్యడానికి నాకనుజ్ఞ యియ్యి.

నోరా—ఇప్పుడు మీరు నాగురించి యేమీచెయ్యలేరు. అదిగాక యిప్పుడు నాకేవిధమైన సహాయముగూడ అక్కరలేదు. ఇదంతా ఊహాకల్పితమని మీ మట్టుకు మీకే తెలుస్తుంది. నిశ్చయముగాను. (ఉయ్యాలకుర్చీలో కూర్చుని మందహాసముతో నతనివైపు చూచును.) డాక్టరుగారు! మీరు చాల తమాషైనవారండీ. దీపంవచ్చిన తరువాత మీకు సిగ్గు వెయ్యలేదు.

రాంక్—ఎంతమాత్రం లేదు. కాని నిన్ను శాశ్వతంగా విడిచిపెట్టేస్తే బాగావుండును ?

నోరా—వద్దు. వద్దు. మీరు నన్ను విడవవద్దు. మీరు పూర్వంవచ్చినట్టే రావాలి. మీరు లేకపోతే టోర్వాల్డుగార్కి పూసుపోదు.

రాంక్—అవునుగాని నీకో ?

నోరా—నాకా? మీరు వస్తే నాకెంతో సంతోషం.

రాంక్—అవునదే. అదే నన్నీతప్పుదారిలోని కీడ్చింది. నువ్వు నాకొక సమస్యవి. నువ్వు హెల్మరుతో నెలాగుంటావో నాతోగూడా అలాగే వుంటావని అనేకసార్లు అనుకునే వాడిని.

నోరా—అవును. ప్రపంచములో కొందరు కొందరిని గాఢంగా ప్రేమిస్తారు. వారినే మరికొందరు స్నేహితులగా భావిస్తారు.

రాంక్—అవునందులో విశేషముంది.

నోరా— నే నింటివద్ద నున్నప్పుడు అప్పగారిని మిక్కిలి ప్రేమించేదాన్ని. కాని నాకెప్పుడూ వెడలిపోయి చెలికత్తెలతో నుండాలనే వుండేది. ఎందుచేతనంటే వాళ్లెప్పుడూ నీతులతో నాతల బద్దలుచెయ్యకుండా అనేకం సరదాలయిన సంగతులు మాట్లాడేవారు.

రాంక్—ఆహాఁ! అయితే వారిస్థానమే నే నాక్రమించాను.

నోరా—(ఒక్కసారిగెంతి అతని దగ్గరకువెళ్లి) ఓహో డాక్టరుగారు! చాలబాగా చెప్పారు. అది నేననుకోనే లేదు. కాని మీకు బోధపడుతుంది. ఇప్పుడు నాభర్తగారితో నుండడం అప్పగారితో నున్నట్టేవుంది.

(ప్రవేశము:—దాసి సావడినుండి.)

దాసి—చిత్తగించండమ్మా! (చెవిలోనేమోచెప్పి ఉత్తరము నిచ్చును.

నోరా—(ఉత్తరమువైపుచూచి) ఓహో ! (దానిని జేబులో పెట్టుకొనును.)

రాంక్—అందులో నేమైనా దుర్వార్తవచ్చిందా యేమి ?

నోరా—లేదు. లేదు. ఏమీలేదు. నాక్రొత్తవస్తుల సంగతి.

రాంక్—ఏమిటి? నీవస్తులు వచ్చివున్నాయా ?

నోరా—అవునదొకటి. ఇదిమరొకటి నేను తెప్పించాను. మావారి కీసంగతి తెలియకూడదు.

రాంక్—ఓహో! అదా యీపరమరహస్యం!

నోరా—అవును. ఆయనదగ్గరకు వెళ్లండి. గదిలో కూర్చున్నారు. ఆయన్ని వీలైనంతసేపు—

రాంక్—నీమనస్సులో భయమేమీ వుంచుకోకు. అతన్ని నేను కదలనియ్యను. (హెల్మరుగదిలోనికి పోవును.)

నోరా—(దాసీతో) ఏం ? అతడువచ్చి వంటింటిదగ్గర నిలుచున్నాడా ?

దాసి—అవును. అతడు పెరటిదారిని వచ్చాడు.

నోరా—కాని యింట్లో నెవరూలేరని నువ్వు చెప్పలేదూ ?

దాసి—చెప్పేను. కాని లాభం లేకపోయింది.

నోరా—అతడు వెళ్లిపోలేదా ?

దాసి—లేదు. అమ్మగారిని చూడందీ వెళ్లనని చెప్పుతున్నాడు.

నోరా—సరే. రానీ నెమ్మదిగామాత్రం రమ్మను. హెలన్ ! ఈసంగతి నువ్వెవ్వరికీ చెప్పకూడదు.

దాసి—చెప్పనమ్మా ! నాకు తెలుసును.

(నిష్క్రమించును.)

నోరా—ఏదో విపరీతం జరుగనున్నది. నే నెంతప్రయత్నించినను జరగకమానదు. లేదు. లేదు. అలాగు జరుగదు. జరగకూడదు. (ఆమె హెల్మరు గది తలుపునకు గొళ్లెము పెట్టును. క్రోగ్‌స్టాడ్ వచ్చుటకై దాసి సావడితలుపు తెరచి అతడు ప్రవేశించిన తరువాత మూసివేయును. అతడొక రోమముకోటు, రోమముటోపి, ఒకపెద్దజోడు ధరించియుండును.)

నోరా—(అతని దగ్గరకువెళ్లి) మెల్లిగా మాట్లాడు. నా భర్తగా రింటివద్దనే వున్నారు.

క్రోగ్—అంతమాత్రానికి ఫర్వాలేదు.

నోరా—నీకేమిటికావాలి ?

క్రోగ్—ఒకదానికి సంజాయిషీ కావాలి.

నోరా—ఏమిటో అది వేగంచెప్పు.

క్రోగ్—నాకు పనిబత్తరపు అయిందని మీకు తెలుసునా ?

నోరా—ఎంతచేసినా నేను దాన్ని ఆపలేక పోయాను క్రోగ్‌స్టాడ్. నిన్నుగూర్చి నేను హాహాకారిగా పోరేను. కాని లాభం లేక పోయింది.

క్రోగ్—మిమ్ము మీభర్త యింతేనా ప్రేమిస్తారు. మీసంగతంతా బయటపెట్టేసి నేనేం చేస్తానో అతనికి తెలుసును. అయినప్పటికీ యీసాహసం చేశారు—

నోరా—ఈసంగతి అతనికి తెలుసునని నువ్వెలాగనుకుంటావు ?

క్రోగ్—నేనలాగనుకోలేను. టోర్వాల్డు హెల్మరు లాంటి వానికి అంతధైర్యముండడం దుర్లభం—

నోరా—క్రోగ్‌స్టాడ్ ! నాభర్తయెడ మర్యాద నతిక్రమించకు.

క్రోగ్—లేదు. అతనికి తగిన మర్యాదే చేస్తాను. ఈ సంగతంతా మీలోనే గోప్యంగా నుంచారు కాబట్టి, మీరు చేసినదానికి, నిన్నటికంటే మీకు బాగాబోధపడిం దనుకుంటాను.

నోరా—నువ్వు చెప్పిందానికంటే గూడాను.

క్రోగ్—నేను పనికిమాలిన వకీలును.

నోరా—నాదగ్గర నీకు కావలసిం దేమిటి ?

క్రోగ్—ఏమీలేదూ. మీరెలాగున్నారో చూద్దామని. ఈరోజంతా మిమ్మును గూర్చే ఆలోచిస్తున్నాను. షరాబు-లేఖరి-నాలాంటి వానికి గూడా కరుణన్నది కొంచెమున్నది.

నోరా—ఏదీ వుంటే చూపించు. నాపిల్లలగూర్చి తలుచుకో.

క్రోగ్—మీరూ మీభర్తగారూ నాపిల్లలగూర్చి తలచారా ? సరే దానికేం లెండి. మీరు ఈవిషయంలో అంత ఆందోళన పడవద్దు. మొదటిలో నేను మీమీద నేమీ నేరారోపణ చెయ్యను.

నోరా—అవును. చెయ్యవు నాకు తెలుసును.

క్రోగ్—ఇదంతా సులువుగా తేలిపోతుంది. ఇది పైవారికి తెలియవలసిన అగత్యంలేదు. ఇది మన ముగ్గురులోనే రహస్యంగా నుంటుంది.

నోరా—ఇది నాభర్త కెంతమాత్రం తెలియకూడదు.

క్రోగ్—తెలియకుండా మీరెలాగు చేస్తారు? మిగిలిన సొమ్ము మీరిచ్చిగలరన్నమాట ?

నోరా—లేదు. ఇప్పుడివ్వలేను.

క్రోగ్—సొమ్ములాగే అవకాశమేదో మీకు వస్తున్నాదికాబోలు.

నోరా—అటువంటి అవకాశ మేమీలేదు.

క్రోగ—సరే. ఏదెలాగైనా ఇప్పుడు మీకేం లాభం లేదు. బాకీవున్నసొమ్మంతా మీరు పట్టుకొని వచ్చినా నేను పత్రమివ్వను.

నోరా—దానితో నువ్వేమి చేస్తావో చెప్పు.

క్రోగ—దాన్ని నేను దాస్తాను జాగ్రత్తగా. దానితో సంబంధము లేనివాళ్లకు దానిగురించేమీ తెలియనివ్వను. కాబట్టి మీకేదైనా ఘోరమైన ఆలోచన గలిగినట్లైతే—

నోరా—కలిగింది.

క్రోగ—ఈయిల్లు విడిచి మీరు వెళ్లిపోవాలనున్నట్లైతే—

నోరా—ఉన్నాది.

క్రోగ—అంతకంటే ఘోరమైన దేదైనా తోచితే—

నోరా—నీకేలాగు తెలిసింది ?

క్రోగ—ఆవుద్దేశాలన్నీ మానియ్యండి.

నోరా—నే నిదంతా ఆలోచించానని నీ కేలాగు తెలిసింది ?

క్రోగ—చాలమంది మొదట యిలాగే ఆలోచిస్తారు. నేనుకూడా యిలాగే ఆలోచించాను. కాని నాకు ధైర్యం చాలిందికాదు.

నోరా—(దుర్బలంగా) నాకంతకంటే—

క్రోగ్—(విశ్రాంతిని సూచించే స్వరముతో) మీకు ధైర్యం కూడా లేక పోయింది. సరే.

నోరా—లేదు. నాకు ధైర్యంలేదు.

క్రోగ్—అదికాక మీరలాగు చేసేటట్టయితే గొప్ప పొరపాటు. ఒక్కమాటతోనే గాలివాన చల్లారుతుంది—మీ భర్తగారిపేర నొకవుత్తరం వ్రాసి తెచ్చాను.

నోరా—అంతభోగట్టా తెలియజేస్తున్నా ?

క్రోగ్—ఉఁ. సాధ్యమైనంత నెమ్మదిగా మెత్తనిమాటలతో—

నోరా—(తొందరగా) అత డావుత్తరం చూడకూడదు. చింపీ. నీసొమ్ముకు నేను వేరే యేర్పాటు చేస్తాను.

క్రోగ్—దేవీ! క్షమించండి. మీకిప్పుడే గదా చెప్పేను—

నోరా—నేను నీకు బాకీవున్న సొమ్ముగూర్చి చెప్పలేదు. నువ్వు నాభర్తనెంత సొమ్మడుగుతున్నావో చెప్పు తెస్తాను.

క్రోగ్—నేను మీభర్తనొక చిల్లిగవ్వకూడ అడగలేదు.

నోరా—అయితే నీకేంగావాలి ?

క్రోగ్—చెప్తాను వినండి. దేవీ! నాపూర్వపు హక్కులు నాకు కావాలి. అందుకై మీభర్తగారి సాయం కావాలి.

సంవత్సరంవర్రై నా కెంపులోను అగౌరవం జరగలేదు. ఆకాలం నేను విషమపరిస్థితులలో మునిగిపోయాను. నేను నాపని మెల్లిగా సాగిస్తూ సంతృప్తి పడ్డాను. ఇప్పుడు నన్ను గెంటేశారు. ఇప్పుడు నాకు తిరిగీ పనియిచ్చినంత మాత్రం చాలదు. మీకు చెప్తున్నాను. నాకు బాంకీలో ఏదైనా పెద్దపనికావాలి. మీభర్తగారు నాకేదైనా కాళీ చూపించాలి—

నోరా—అది ఆయన చెయ్యరు.

క్రోగ్—అతడే యిస్తాడు. నాకు తెలుసును. ప్రతిఘటించడాని కాతనికి సాహసంలేదు. అతనితో సరిగానున్నప్పుడు నాసంగతి తెలుస్తుంది. ఒక సంవత్సరంలో నేను మేనేజరుగారి కుడిభుజంలాగుంటాను. అప్పుడు బాంకీపరిపాలన నడిపేది. నిల్సు క్రోగ్‌స్టాడ్ కాని టోర్వాల్డుహెల్మరు కాదు.

నోరా—అటిసిథ్తెప్పుడూ నువ్వు చూడవు.

క్రోగ్—ఆలాగు కాదనడానికి మీకు—?

నోరా—ఆలాగనడానికి నాకిప్పుడు ధైర్యంవచ్చింది.

క్రోగ్—మీరు నన్ను జడిపిస్తున్నారా ? మీలాంటివారికి నేను జడవను.

నోరా—నువ్వే చూస్తావు.

క్రోగ్—మంచుకింద్రను కాబోలు ? లేకపోతే నీళ్లక్రిందను. తరువాత వసంతకాలంలో పైకి తేలి భయంకరంగా,

పోల్చుకోడానికి వీలులేకుండా, జుత్తు ముఖాన్నంతా కప్పేస్తూ వుంటే——

నోరా——నువ్వు భయపెడితే నేనేం జడవను.

క్రోగ్——నే నంత కన్నాను. దేవీ! ఇంతమాత్రాని కెవరూ జడిసిపోరు. అదిగాక యేంలాభం. అతడు పూర్తిగా నా చేతిలో చిక్కాలి.

నోరా——తరవాత? నేను మరిలేకపోతే——

క్రోగ్——మరచిపోయారా. మీప్రతిష్ఠ కాపాడేది నేనే గదా? (నోరా నోటమాటలేక అతనివైపు చూచును.) సరే; మీకు ముందు తెలియజేశాను. అవివేకంగా యేమీచెయ్యకండి. హెల్మరుపకు నావుత్తరం చేరిన తరువాత అతని జవాబున కెదురు చూస్తూవుంటాను. ఇటువంటి కార్యానికంతా మీ భర్తగారే కారణమన్నమాట మరచి పోకండి. నేనతడు చేసిన పని మరచిపోను. దేవీ! సెలవు. (సావడిగుండా నిష్క్రమించును.)

నోరా——(సావడిద్వారం కడకు పోయి, తలుపు కొంచెము తెరచి వినును.) అతడు వెళ్లిపోతున్నాడు. ఉత్తరాల పెట్టెలో నుత్తరం వెయ్యడము లేదు. లేదు. లేదు. అలాగెందుకు చేస్తాడు. (మెల్లమెల్లగా తలుపు తెరుచును.) ఏమిటది? అతడు పైని నిలుచున్నాడు. అతడు క్రిందకు వెళ్లడములేదు. సందేహిస్తున్నాడా యేమి?——(పెట్టెలో నొక వుత్తరంపడును.

పిదప క్రోగ్‌స్టాడ్ యొక్క అడుగుల చప్పుడు వినబడి అతడు క్రిందకు పోవునప్పుడు క్రమక్రమముగా నశించును. నోరా నిరుద్ధమైన యరపు నరచి సోఫావద్దనున్న మేజాకడకు పరుగెత్తును. కొంతసేపూరుకొనును.)

నోరా—ఉత్తరాలపెట్టెలో (నక్కినక్కి సావడిద్వారము వద్దకు వెళ్లును.) అదిగో. అక్కడున్నాది, నాథా ! నాథా! మనకు మరాశలేదు. (దుస్తులు పట్టుకొని లిండీదేవి ఎడమప్రక్కనున్న గదినుండి వచ్చును.)

లిండీ—ఇంకా మరి కుట్టడానికి నాకేమి కనబడలేదు. ఒకసారి తొడుక్కొని చూస్తావా ?

నోరా—(బొంగురుపోయిన కంఠముతో మిక్కిలి మెల్లగా) క్రిస్టినీ! యిటురా ?

లిండీ—(దుస్తులను సోఫామీద పడవైచి) ఏమిటి సంగతి ? నువ్వు చాల ఆందోళన పడినట్టు కనబడుతున్నావు !

నోరా—ఇటురా? ఆవుత్తరం చూశావా ? అదిగో చూడు—ఉత్తరాలపెట్టె యొక్క గాజుతలుపుగుండా నీకు కనబడుతుంది.

లిండీ—అవును. నాకు కనబడ్డాది.

నోరా—అది క్రోగ్‌స్టాడ్ వ్రాసిన వుత్తరం.

లిండీ—నోరా! అయితే నీకు సొమ్మిచ్చినది క్రోగ్‌స్టాడా?

నోరా—అవును. నాభర్తగారి కిప్పు డాసంగతంతా తెలిసిపోతుంది.

లిండీ—నోరా! నామాటవిను. అది మీ యిద్దరకు మంచిదే.

నోరా—నీకు తెలియదు. నేను కూటసంతకము చేశాను.

లిండీ—అయ్యోపుణ్యమా!

నోరా—క్రిస్టైనీ! నువ్వీమాటచెప్పాలి—నువ్వు నాకు సాక్ష్యంగా నుండాలి.

లిండీ—నీకు సాక్ష్యమా! నువ్వన్నమాటేమిటి? నేనేమి చెయ్యాలి?

నోరా—నాకు మతిపోయి నేను తెలివి తప్పిపోతే—

లిండీ—నోరా!

నోరా—లేక నాకు మరేదైనా జరిగితే, దేనివల్లనైనా నే నిక్కడ వుండడానికి వీలు లేకపోతే—

లిండీ—నోరా! నోరా! నీకు నిజముగా పిచ్చెత్తిందే.

నోరా—ఎవరైనా నాపూచీ వహించవలసినవారుంటే—నానింద భరించవలసిన వారుంటే తెలిసిందా—

లిండీ—తెలిసింది. తెలిసింది—కాని అలాగవుతుందని నువెలాగనుకుంటున్నావు?

నోరా—అప్పుడు నువ్వు నాతరపున సాక్ష్యం చెప్పాలి. ఇదంతా అసత్యమని. క్రిస్టైనీ! నే నిప్పుడేమి మతి తప్పిపోలేదు. నేను పూర్ణమైన తెలివితోనే వున్నాను. దీన్ని గురించి యెవరికీ యేమీ తెలియదు. ఈసంగతంతా నేనే—నే నొక్కర్తనే యిదంతా చేశాను.

లిండీ—ఆలాగే చేస్తాను. కాని నాకిదంతా బోధపడలేదు.

నోరా—నీ కెలాగు బోధపడుతుంది. ఏదో ఒక విపరీతం జరుగబోతున్నాది.

లిండీ—విపరీతమా ?

నోరా—అవును. చాలవిపరీతం—కాని చాలభయంకరమైంది. క్రిస్టైనీ! అదెంతమాత్రం జరగకూడదు.

లిండీ—నేను యిప్పుడే క్రోగ్‌స్టాడ్ దగ్గరకు వెళ్తాను.

నోరా—వెళ్లవద్దు. అతడు నీకేదైనా హానిచేస్తాడు.

లిండీ—ఒకప్పుడతడు నేను గీచినగీటు దాటక నేను చెప్పినదల్లా చేసేవాడు.

నోరా—అతడా ?

లిండీ—అతడెక్కడుంటాడు ?

నోరా—అది నాకెలాగు తెలుస్తుంది—అన్నట్టు (జేబులోను త్తరమును తడిమి) ఇదిగో నుత్తరము. కాని అయ్యో! ఆవుత్తరమో ! ఆవుత్తరమో !

హెల్మరు—(తనగదిలోనుండి తలుపుకొట్టిపిలుచును.) నోరా!

నోరా—(ఆందోళనముతో నరచి) ఎందుకు? మీకేం గావాలి?

హెల్మరు—నువ్వేమిభయపడకు. నీగదిలోనికి మేము రాములే. నీగదితలుపు గడియవేసున్నాది. నీదుస్తులు తొడుక్కు చూస్తున్నావా?

నోరా—అవునవును. ఇప్పుడు నేను చాల అందంగా నున్నాను నాథా!

లిండీ—(ఉత్తరముకుచదివి) సరే. అత డీసందులోనా వున్నాడు.

నోరా—కాని లాభంలేదు. వేళ మించిపోయింది. అదిగో ఆపెట్టెలో ఉత్తరమప్పుడే వున్నాది.

లిండీ—తాళంనీమొగుడుదగ్గర నేవుంటుందా?

నోరా—ఆఁ.

లిండీ—క్రోగ్స్టాడ్ వుత్తరం చదవకుండా యిచ్చి వమని చెప్పాలి. ఏదోకారణం కల్పించి—

నోరా—కాని సాధారణంగా నాభర్తగారీవేళకే ఉత్త రాలపెట్టె తీస్తారు.

లిండీ—అతడు తియ్యకుండా విలంబంచెయ్యి. అతని దగ్గరకు నువ్వువెళ్లు. నేను సాధ్యమైనంతత్వరలో వస్తాను. (సావడి ద్వారముగుండా తొందరతొందరగాపోవును.)

నోరా—(హెల్మరుగదితలుపువద్దకువెళ్ళి కొంచెము తెరచి తొంగిచూస్తూ) నాథా !

హెల్మరు—(లోపలగదిలోనుండి) ఏం ? ఇప్పటికైనా నాగదిలోనికి నేను రావచ్చా ? రాంక్ ! రా చూద్దుగాని (ద్వారబంధందగ్గరనాగి) కాని యిదేమిటిది?

నోరా—ప్రియా ! ఇదేమిటా ?

హెల్మరు—ఏదో ఒక అద్భుతమైన వేషం వేస్తున్నావని రాంక్ చెప్పాడు.

రాంక్—(ద్వారంలో) నే నలాగనుకున్నాను. గాని పొరపాటు.

నోరా—ఎవరికిన్ని రేపటిదాకా నన్ను నాకొత్త దుస్తులతో చూడడానికి హక్కులేదు.

హెల్మరు—కాని ప్రియే! నోరా! నువ్వు చాలచిక్కిపోయినట్టు కనిపిస్తున్నావు. చాలహెచ్చుగా అభ్యాసం చేస్తున్నావా యేమిటి ?

నోరా—లేదు. నే నభ్యాసం చెయ్యనేలేదు.

హెల్మరు—కాని నువ్వభ్యాసంచెయ్యాలి.

నోరా—అవును. తప్పకుండాచేస్తాను. కాని,మీసాయం లేకపోతే ఒకపిసరు జరగదు. నే నదంతాపూర్తిగా మరచిపోయాను.

హెల్మరు—సరే. అదంతా ఒక్కదెబ్బలో అలవాటవుతుంది.

నోరా—సాయం చెయ్యండి నాథా! సాయం చేస్తానని ఒప్పుకోండి. నాకు చాలభయంగా వుంది. అందరూ ఈసాయంత్రం మీరు నన్ను గూర్చి మీపనులన్నీ విడిచిపెట్టేయాలి. ఒక చిన్నపిసరుపనైనా ముట్టుకోకూడదు. చేతిలో కలంగూడాపట్టుకోకూడదు. ఆలాగు ఒప్పుకుంటారా?

హెల్మరు—తప్పకుండాను. ఈసాయంత్రం నువ్వేమిచెప్పితే అదేచేస్తాను. అన్నట్టు మొదట—(సావడిద్వారం దగ్గరకు వెళ్లును.)

నోరా—అక్కడకెందుకు వెళుతున్నారు?

హెల్మరు—ఎందుకూ లేదు. ఉత్తరాలేమైనావున్నాయేమో చూడ్డానికి.

నోరా—వద్దు. వద్దు. నాథా! ఆపనివద్దు.

హెల్మరు—ఎందుకొద్దు?

నోరా—వెళ్ళవద్దు. అందులో యేమీలేవు.

హెల్మరు—పోనీ వెళ్లి చూడనీ. (ఉత్తరాలపెట్టెవద్దకు వెళ్లబోవును. నోరా పియానోవద్ద టరంటలానృత్యము చేస్తూ ఆరంభగీతములుపాడును) ఆహా!

నోరా—మీదగ్గరుండి నేనభ్యసించకపోతే రేపు నేను నృత్యంచెయ్యలేను.

హెల్మరు—(ఆమెదగ్గరకువెళ్లి) నిజంగా నీకంతభయంగా ుందా ప్రియా!

నోరా—నిజంగాను, నాథా! ఆరంభించనియ్యండి. మనం భోజనానికి వెళ్లేలోపుగా కావలసినంత వేళుంది. కూర్చుని వాయించండి. విమర్శించి నాఆటలో తప్పుంటేదిద్దండి.

హెల్మరు—నువ్వు కోరితే యెంతో సంతోషంతో. (పియానో వద్ద కూర్చుండును.)

నోరా—(మందసమునుండి ఒకకంజరియు, చిత్రవర్ణమైన శాలును తీయును. శాలును తొందరతొందరగా తనచుట్టూచుట్టుకొనును. అంతట రంగస్థలాగ్రమునకుదాటి గట్టిగాపిలుచును). ఇకనువాయించండి. నేను నాట్యంచేస్తాను. (హెల్మరువాయించుచుండును. నోరా నాట్యముచేయుచుండును. రాంక్ ప్రియానో ప్రక్కను, హెల్మరునకు వెనుక నిలబడిచూచుచుండును.)

హెల్మరు—(వాయిస్తూ) మెల్లిగా మెల్లిగా.

నోరా—ఇంతకంటే నేను మెల్లిగా నాట్యంచెయ్యలేను.

హెల్మరు—అంతతొందరగా కాదు నోరా!

నోరా—ఇలాగా?

హెల్మరు—(వాయించడంమాని) కాదు. కాదు. అలాగు కానేకాదు.

నోరా—(నవ్వుతూ కంజరివూపుతూ) నేను చెప్పలేదా?

రాంక్—నేను వాయిస్తాను.

హెల్మరు—(లేచి) వాయించు, నేను దిద్దడానికి వీలుంటుంది. (రాంక్ పియానోవద్దకూర్చొనివాయించును. నోరా మరీ మరీ ఉద్రేకంతో నాట్యంచేయును. హెల్మరు స్టవ్వుప్రక్కనిలబడి, ఆమెనాట్యంచేస్తూవుంటే మాటిమాటికి "ఇలాగు. ఇలాగు." అనిచెప్పుతూవుండును. ఆమెకొప్పుజారి భుజములమీాద పడును. దాని నేమాత్రమును సరకుచెయ్యక ఆమె నృత్యంచేయును. [ప్రవేశము లిండీదేవి.]

లిండీ—(ద్వారములో నిర్ఘాంతపోయి కొయ్యబొమ్మవలెనిలబడి) ఓహో!

నోరా—(నృత్యంచేస్తూ) బాగుందా క్రిస్టైనీ ?

హెల్మరు—ప్రియా నోరా! నీజీవితమంతా దీనిపైనే ఆధారపడినట్టునాట్యం చేస్తున్నావు.

నోరా—అవును. నిజమే.

హెల్మరు—రాంక్! వాయించొద్దు. అదిగో నీకేంపిచ్చామానీమంటే. (రాంక్ వాయించుటమానివేయును. నోరా తత్‌క్షణమే నిలబడిపోవును హెల్మరు ఆమెదగ్గరకువెళ్లును) నేను నమ్మలేదు. నీకుచెప్పిందంతా మరచిపోయావంటే.

నోరా—(కంజరీపారవైచి) చూశారా.

హెల్మరు—ఇంకా నీకు చాలతరిఫీదుచెయ్యాలి.

నోరా—అవును. ఎంతతరిఫీదుచెయ్యాలో మీారు చూశారుగదా. ఆఖరుదాక నాకు చెప్పుతు నేవుండాలి. అలాగుచేస్తానని వాగ్దత్తంచెయ్యండినాథా!

హెల్మరు—ఆలాగే తప్పకుండా చేస్తాను.

నోరా—ఇవాళగాని, రేపుగాని నన్ను తప్ప మీరొకపని తలచుకోకూడదు. ఒకవుత్తరమైనా చూడకూడదు. ఉత్తరాల పెట్టెనైనా తియ్యగూడదు.

హెల్మరు—అయ్యో! వాడిమాటకు నువ్వు చాలజడిసి పోయినట్టున్నావు.

నోరా—అవును. నిజంగాను.

హెల్మరు—నోరా! నిన్ను చూస్తే నేనుపోల్చుకున్నాను. వాడిదగ్గరనుండి యేదో ఒకవుత్తరం ఉత్తరాలపెట్టెలో నున్నట్టున్నది.

నోరా—నాకు తెలియదు. ఉంటేఉంటుంది. కాని అటువంటివేమి మీరిప్పుడు చదవగూడదు. ఇదంతా జరిగిందాక మన కేమివిషాదకరమైనవార్త తెలియగూడదు.

రాంక్—(హెల్మరు చెవిలో గుసగుసలాడును) ఆమె మాట తోసికండి.

హెల్మరు—(ఆమెను తనహస్తపంజరముచే బంధించి) పోనీ పిల్లమాటే కానీయండి. కాని రేపురాత్రి నువ్వు నాట్యంచేసి నతరవాత—

నోరా—అప్పుడు మీయిష్టమే. (కుడిప్రక్కనుండిద్వారములో దాసికనబడును.)

దాసి—అమ్మా! వడ్డనైంది.

నోరా—ద్రాక్షారసంకూడావుండాలి, హెలన్.

దాసి—చిత్తం. అమ్మా!

హెల్మ—ఆహా! మనం విందుకు పోతున్నామా? (దాసి నిష్క్రమించును.)

నోరా—అవును. ద్రాక్షారసంవుంటే చిన్నవిందే—(పిలుచును) హెలన్! కొంచెం బిస్కత్తులుకూడాను.

హెల్మ—రా. రా. పిచ్చెత్తిపోకు. పూర్వం ఎలాగుండేదానివో, ఇప్పుడూ అలాగేవుండు. నాచిన్నారి భరతపక్షి.

నోరా—ప్రియా! ఆలాగే వుంటాను. కాని లోపలికి వెళ్లండి. డాక్టరుగారు మీారుగూడాను. క్రిస్టినీ! నాతలదువ్వు.

రాంక్—(వెళుతూ హెల్మరుతో గుసగుసలాడును) అక్కడేమీా లేదుగాబోలు—ఆమె దేనికోసమో నిరీక్షిస్తున్నాదా యేమి?

హెల్మ—అదేమికాదు. నీకుచెప్పుతూ వుండేవాణ్ణికాను. అది చిన్నపిల్లలపిరికితనంలాంటిది కాని వేరుకాదు. (కుడీచేతి వైపునున్న గదిలోనికి పోవుదురు).

నోరా—ఏమియైంది?

లిండీ—ఊరులో లేడు.

నోరా—నిన్ను చూడగానే నే ననుకున్నాను.

లిండీ—రేపుసాయంత్రం యింటికొస్తాడు. అతనిపేర కాకజాబువ్రాసి వచ్చాను.

నోరా—దానిమట్టుకు దాన్ని నువ్వు విడిచిపెట్టివల సిందే. నువ్వేమి నిరోధించవద్దు. ఇదంతా అయిపోయిన తరువాత అద్భుత పర్యవసానంకోసం నిరీక్షిస్తూవుండడమే మంచిది.

లిండీ—నువ్వు దేనికోసం నిరీక్షిస్తున్నావు ?

నోరా—అయ్యో ! నీకు తెలియదు. వాళ్ళదగ్గరకు వెళ్లు ఇప్పుడే నేను వస్తాను. (లిండీదేవి భోజనశాలలోనికి పోవును. ఒకక్షణము నోరా కదలకుండా నిలబడును. ఏదో ఆలోచిస్తున్నట్టు. పిదప వాచీవైపు చూచును.) ఐదుగంటలు. ఇంకా మధ్యరాత్రకు ఏడుగంటలు. అప్పటినుండి రేపటి మధ్యరాత్రికి ఇరవైనాలుగు గంటలు. అంతటితో టరంటలా అయిపోతుంది. ఇరవైనాలుగున్ను ఏడు? నాజీవితకాల మింకా ముప్ఫైయొక్క గంటమాత్ర ముంది.

హెల్మ—(ఎడమవైపునున్న ద్వారమునుండి) నాభరత పక్షి యెక్కడుంది.

నోరా—(చేతులు చాచుకొని అతనిదగ్గరకు వెళుతూ) ఇదిగో యిక్కడ !

ఇది ద్వితీయాంకము.

# బొమ్మరిల్లు.

## తృతీయాంకము.

రంగము.

[రంగమధ్యమున మేజాయు దానిచుట్టూ కుర్చీలు నుండును. మేజామీద దీపం వెలుగుతూ వుండును. సావడిలోనున్న ద్వారం తీసియుండును. మేడమీదిగదిలో నృత్యసంగీతములు వినబడును. లిండీదేవి మేజావద్ద కూర్చొని పుస్తకము యొక్క పత్రములు త్రిప్పుతూ వుండును. ఆమె చదువుటకు ప్రయత్నించుచుండెను. గాని యామె చదివినదేదో యామెకు బోధపడకుండును. మధ్యమధ్య నామె వీధితలుపు చప్పుడవుతున్నదేమో యని వినుచుండును.]

లిండీ—(వాచీతట్టు చూచి) ఇంకా రాలేదు- వేళ కూడా వచ్చింది. అతడుగాని రాకపోయినట్టయితే—(తిరిగీ వినును.) అదిగో వచ్చాడు. (సావడిలోనికి వెళ్ళి వీధితలుపు జాగ్రత్తగా తీయును. మేడమెట్లమీద కొంచెముకొంచెము అడుగులసవ్వడి వినబడును. ఆమె గుసగుసలాడును) లోపలికిరా. ఇంట్లో ఎవరూ లేరు.

క్రోగ్—(ద్వారంలో) ఇంటిదగ్గిర నీవుత్తరం కనబడింది. ఎందుకు ?

లిండే—నీతో మాట్లాడవలసిన పనున్నాది.

క్రోగ్—నిజంగా. అయితే మనం ఇక్కడే మాట్లాడుకోవలసి వున్నాదా యేమిటి ?

లిండే—నాబసలో మాట్లాడుకోడానికి వీలులేదు. నాగదికి ప్రత్యేకంగా ద్వారాలు లేవు. ఇక్కడే మాట్లాడుకుందాం ఎవరూలేరు. దాసీ పడుకున్నాది. మిగిలిన వాళ్ళంతా మేడమీద నృత్యం దగ్గిరున్నారు.

క్రోగ్—(గదిలోనికి వచ్చి) నిజంగా హెల్మరు నోరాలు నృత్యం దగ్గిరున్నారా ?

లిండే—ఉన్నారు. ఉండకేం ?

క్రోగ్—నిశ్చయంగా- ఉండకేమూ ?

లిండే—నిల్సు, రా. మనిద్దరం మాట్లాడుకుందాం.

క్రోగ్—మనంమాట్లాడుకోవలసినదియేమైనావుందా?

లిండే—చాలావుంది.

క్రోగ్—నే నెప్పుడూ అనుకోలేదు.

లిండే—లేదు. నువ్వు నన్ను సరిగా బోధపర్చుకోలేదు.

క్రోగ్—ఇప్పుడు ప్రపంచకంలో అందరికీ - తెలిసింది కాక యింకా యేమానావుందా ? దయావిహీనురాలైన

కాంత, ఎక్కువ డబ్బుకాసించి తన్ననుసరించుకొన్న వానిని కాలితో తన్ని తోలేస్తుంది.

లిండీ—నే నంత దయావిహీనురాలననియా నీవుద్దేశం? నే నాలోచించకుండానే యిదంతా చేశా ననుకుంటున్నావా?

క్రోగ్—ఆలోచించకుండా చెయ్యలేదా ?

లిండీ—నిల్స్! నువ్వు నిజంగా అలా గనుకున్నావా ?

క్రోగ్—నువ్వు చెప్పింది నిజమైతే, నాకు నువ్వెందు కలాగు వ్రాశావు ?

లిండీ—నాకు మరోదారి లేకపోయింది. నీతో చెప్తాతున్నాను. నాగురించి నువ్వుపొందిన విచారాన్ని తుదముట్టించడమే నా బాధ్యత.

క్రోగ్—(చేతులునులుపుకుంటూ) అయితే అదీకారణం ఇదంతా—సొమ్ముకోసం.

లిండీ—అనాధమైన ముసలితల్లినీ, ఇద్దర్తిమ్ముళ్లను, నేను పోషించవలసినమాట మరచిపోకు. నీకోసం మేము మరి నిరీక్షించలేకపోయాము. నిల్స్! నీస్థితిగతులుకూడా అప్పటికి మరేంలాభకరంగా కనబడలేదు.

క్రోగ్—అయుండవచ్చును. కాని మరొకరికోసమై నన్ను పరిత్యజించడానికి నీకేమీకారణంలేదు.

లిండీ—ఆసంగతి నాకు తెలియదు. ఎన్నోసార్లు నామట్టుకునేన్ను "నేను చేసినది తప్పాఒప్పా" అని ప్రశ్నించుకున్నాను.

క్రోగ్—(కొంచెం నెమ్మదిగా) నువ్వు నాదగ్గరనుండిపో యినప్పుడు, ఈ ప్రపంచకమంతా నాకు నశించినదనే తలిచాను. ఇప్పుడు నన్ను చూడు—భంగమైన నౌకయందలి నావికుని వలె నేనొక భగ్నశకలమును పట్టుకొని దేవులాడుతున్నాను.

లిండీ—కాని సహాయము చేరువనుండి రావచ్చును.

క్రోగ్—ఒకప్పుడు చేరువనే వుండేది. కాని దానికి నువ్వు మధ్య నడ్డువచ్చావు.

లిండీ—అలాగవుతుందని నేను కలలోనైనా తలవ లేదు. నాకీవేళ తెలిసింది. బాంకీలో నీకు బదులుగా నన్ను వేశారని.

క్రోగ్—నువ్వలాగు చెప్పుతే నేను నమ్ముతాను. కాని యిప్పుడు తెలిసినతరువాతైనా ఆపని మానేస్తావా?

లిండీ—మానను. దానివల్ల నీకేంలాభము లేదు.

క్రోగ్—లాభమా!—లాభమో నష్టమో. నేనైతే తప్పక మానేసివుందును.

లిండీ—నాకు ప్రపంచకంలో కష్టపడి వివేకంతో బ్రత కడం తెలుసును. కష్టపరంపరలు నాకు దాన్ని బాగాబోధపరి చాయి.

క్రోగ్—మిసిమిమాటలను నమ్మవద్దని నాజీవితానుభ వంకూడా నాకు చెప్పింది.

లిండీ—అయితే నీజీవితంలో కొంతవుపయోగమైనదే నేర్చుకున్నావు. కాని మాటలు నమ్మకపోయినా నువుకా కార్యాలను నమ్మాలి. ఏం ?

క్రోగ్—అంటే ?

లిండీ—నువ్వు "భంగమైన నౌకయందలి నావికుని వలె నౌక భగ్నశకలమును పట్టుకొని దేవులాడుతున్నా" నని అన్నావు.

క్రోగ్—అలాగు అనడానికి నాకు కావలసినంత కారణా ముంది.

లిండీ—సరే. నేనున్నూ భంగమైన నౌకయందలి నావికునివలె నౌక భగ్నశకలమును పట్టుకొని దేవులాడుతున్నా ను—నన్నుగూర్చి విచారించడానికి గాని సంరక్షించడానికి గాని యెవరూ లేరు.

క్రోగ్—అది నువ్వే చేసుకున్నావు.

లిండీ—అప్పుడు చేసుకోడానికి మరొకదారి లేకపో యింది.

క్రోగ్—అయితే యిప్పుడో ?

లిండీ—నిల్స్! మనయిద్దరం నౌకాభంగనావికులము ఒకదగ్గిర కూడినట్లైతే ?

క్రోగ్—నువ్వేమిటంటావు ?

లిండీ—వేరే వేరే వున్నకంటే ఇద్దరం ఒకభగ్నశకలం మీాదే వున్నట్టయితే, అవకాశం హెచ్చుగానుండదా ?

క్రోగ్—క్రిస్టెనీ !

లిండీ—నే నీపట్నాని కెందుకు వచ్చాననుకుంటావు ?

క్రోగ్—నువ్వు నాకొక ఆశకల్పిస్తున్నావా ?

లిండీ—పనిలేని జీవనం నాకు దుర్భరముగా నుంటుంది. నాకు జ్ఞానమున్నంతమట్టుకు నే నెప్పుడూ పనిచేస్తూనే వుండే దాన్ని. అదే నాకు పరమానందం. కాని యిప్పుడు నే నీప్రపంచకంలో నేకాకినై యున్నాను. నాజీవితమంతా డొలకవలె నుంది. నేను త్యక్తజీవినిగా కనిపిస్తున్నాను. ఎవరికోసంవారు కష్టపడడం యెంతమాత్రం సంతోషకరం కాదు. నిల్స్! నాకెవరి నేనాయిచ్చి నాకు కొంతపని కల్పించు.

క్రోగ్—నే నామాటనమ్మను. నువ్వుచేసిన త్యాగము స్త్రీలయొక్క అమేయస్వార్థరాహిత్యప్రకటనాభిలాషచేత కలుగుతుంది.

లిండీ—అట్టిదేదయనా నువ్వునాయందు కనిపెట్టేవా ?

క్రోగ్—నిజంగా నువ్విట్టిత్యాగం చెయ్యగలవా ? చెప్పు. నాగడచిన జీవితమునుగూర్చి నీకేమైనా తెలుసునా ?

లిండీ—తెలుసును.

క్రోగ్—ఇక్కడ నన్నుగూర్చి ప్రజ లేమిటనుకుంటు న్నారో నీకు తెలుసునా ?

లిండీ—నీమాటలనుబట్టి యికముందు నువ్వు మారిపో తావని తెలుస్తున్నాది.

క్రోగ్—అవును.

లిండీ—ఇప్పుడేమి వేళమించిపోయిందా ?

క్రోగ్—క్రిస్టైనీ! నువ్విదంతా ఆలోచించే చెప్తున్నా వా? అవునలాగే అనుకుంటాను. నీముఖంలో అది కనబడు తున్నది. నిజంగా నీకు దానికి ధైర్యముందా ?

లిండీ—నా కెవరినైనా పిల్లలనుపెంచి పెద్దచేసి, వారికి తల్లిగావుండాలనుంది. ఇప్పుడు నీబిడ్డలకు తల్లిలేదు. మన మొక రికొకరమవసరము. నిల్స్ ! నీశీలమునుగూర్చి నాకు గాఢమైన నమ్మకముంది. నిన్నుగూడి నే నెట్టిపనినైనా సాధించగలను.

క్రోగ్—(ఆమె చేతులను గట్టిగాపట్టుకొని) క్రిస్టైనీ! నీకు వందనములు. ప్రపంచంలో నాప్రతిష్ఠ నిలుపుకోడానికి ప్ర యత్నిస్తాను. అయ్యో ! అన్నట్టు మరచిపోయాను—

లిండీ—(విని) ఊరుకో! టరంటలానృత్యం అవుతున్నా ది. వెళ్ళిపో. వెళ్ళిపో.

క్రోగ్—ఎందుచేత? ఏమిటది ?

లిండీ—వారిమాటలు వినబడుతున్నాయా ? అదయిపో యిన తరువాత తిరిగీ వాళ్లు వెళ్ళిపోవస్తారు.

క్రోగ్—అవునవును. నేను వెళ్ళిపోతాను. కాని లాభం లేదు. నోరాటోర్వాల్డులగూర్చి నే నేమిచేశానో నీకు తెలి యదు.

లిండీ—నాకదంతా తెలుసును.

క్రోగ్—అది తెలిసినప్పటికీకూడ నీకింకా ధైర్యం ?

లిండీ—నిస్పృహచే నీలాంటివాళ్లెంత తెగువచేస్తారో నాకు బాగా తెలుసును.

క్రోగ్—నేను చేసినదాన్ని కాకుండా చెయ్యగలిగినట్లైతే !—

లిండీ—నువ్వు చెయ్యలేవు. నీవుత్తరం ఉత్తరాలపెట్టెలో నింకాపడి వుంది.

క్రోగ్—నిజమేనా ? నీకు బాగా తెలుసునూ ?

లిండీ—నాకు తెలుసును. కాని—

క్రోగ్—(పరీక్షాదృష్టితో నామెవైపు చూచి) అదేనా నువ్వన్నమాట కర్థం ? ఎలాగైనా నీస్నేహితురాలను రక్షించాలని చూస్తున్నావు ? యథార్థంగా చెప్పు. అదేనా ?

లిండీ—నిల్స్! ఒకసారి తన్నొకరికై విక్రయించుకున్న స్త్రీ తిరిగీ తన్ను తాను విక్రయించుకోగలదా ?

క్రోగ్—నావుత్తరం యిచ్చీమని అడుగుతాను.

లిండీ—వద్దు. వద్దు.

క్రోగ్—లేదు. తప్పకుండా తీసుకుంటాను. హెల్మరు వచ్చిందాక నే నుంటాను. నాఘుత్తరం నా కిచ్చీమనిన్ని—అది నాబత్తరపువిషయమనిన్ని—చదవకుండా యిచ్చీమనిన్నీ, అడుగుతాను.

లిండీ—నిల్స్! నీవుత్తరం నువ్వు తిరిగీ తీసుకోవద్దు.

క్రోగ్—కాని చెప్పు. దానికే కదా నువ్వు నన్నిక్కడకు రమ్మని వ్రాసింది?

లిండీ—మొదట నాకు భయంచే ఆవుద్దేశంతో వ్రాశాను. కాని యీయిరవైనాలుగుగంటలై యీయింట్లో ననేక సంశయాస్పదమైన సంగతులు చూశాను. ఇదంతా హెల్మరుకు తెలియాలి. ఈకష్టతరమైన రహస్యం బహిరంగపరచాలి. ఒకరినొకరు చక్కగా తెలుసుకోవాలి. అసత్యపుంజముల కాకరమైన యీమాతముంపుకులో చక్కగా తెలుసుకోవడం కష్టం.

క్రోగ్—సరే. నువ్వాకార్యభారం వహిస్తే. కాని నేనొక్కకార్యంమాత్రం చెయ్యగలను. అది వెళ్ళినవెంటనే చేస్తాను.

లిండీ—(విని) నువ్వు తొందరగా వెళ్ళిపోవాలి. నాట్యం అయిపోయింది. ఆలస్యమైతే క్షేమంకాదు.

క్రోగ్—నీకోసం నేను క్రింద నిలబడతాను.

లిండీ—అలాగే ఉండు. నువ్వు నన్ను మాయింటికి దిగబెట్టాలి.

క్రోగ్—ఇంత అద్భుతావహమైన అదృష్టం నాకెప్పుడూ పట్టలేదు. (వీధిద్వారముగుండా బయటికిపోవును. గదికి సావడికి మధ్యనున్న ద్వారము తెరవబడియుండును.)

లిండీ—(గది సర్ది దుస్తులను టోపీ సరిగా పెట్టును.) ఎంతభేదము. ఎంతభేదము. ఒకరికోసం కష్టపడి జీవించడము- సౌఖ్యోపాదనకారియైన యిల్లు- తప్పకుండా నేనలాగుచేస్తాను. వారు త్వరగా వస్తే బాగుణ్ణు. (విని) ఆఁ. అరుగో. నా దుస్తులు నేను ధరించాలి. (దుస్తులను టోపీని తీయును. హెల్మరుయొక్కయు నోరాయొక్కయు కంఠస్వరములు బయటికి వినబడును. తాళముతీసి హెల్మరు బలవంతముగా నోరాను సావడిలోనికి తీసుకొని వచ్చును. ఆమె యిటలీదేశపు దుస్తులు దాల్చి నల్లని పెద్దశాలువ కప్పుకొనియుండును. అతడు సాయంత్రపు దుస్తులలో నుండును. నల్లని అంగరఖా గుండీలు లేక విప్పబడియుండును.)

నోరా—(ద్వారములో నీడిగిలబడుతూ అతనితో పెనుగులాడును) వద్దు. వద్దు. నన్ను తీసికొని వెళ్ళకండి. నాకు మేడమీదికు పోవాలనుంది. నా కింతవేగం రావాలని లేదు.

హెల్మ—కాని నాప్రియా! నోరా!—

నోరా—నామాటవినండి నాథా! మరొక్కగంట.

హెల్మ—మరొకనిమిషమైనా వీలులేదు. నాముద్దుల నోరా! మన ఒప్పందలేమిటో నీకు తెలుసును గదా. రా. గదిలోనికి రా. ఇక్క డుండడంచేత నీకు శైత్యంచేస్తుంది. (ఆమె యీడిగిల బడుతున్నా అతడు నెమ్మదిగా నామెను గదిలోనికి చేర్చును.)

లిండీ—అమ్మా! నమస్కారము.

నోరా—క్రిస్టినీ!

హెల్మ—ఇంతరాత్రైనా మీ రిక్కడనే వున్నారా లిండీదేవిగారూ?

లిండీ—అవును. క్షమించండి. నోరాను ఆమె వేషంతో చూడాలనున్నాను.

నోరా—నాకోసమేనా నిరీక్షించుకొని కూర్చున్నావు?

లిండీ—అవునమ్మా! నేను చాల ఆలస్యంగా వచ్చాను. నేను వచ్చేటప్పటికి మీరప్పుడే మేడమీదకు వెళిపోయినారు. మిమ్మన్ని చూడకుండా నేను వెళ్ళగూడదని కూర్చున్నాను.

హెల్మ—(నోరా కప్పుకున్న శాలుతీసేసి) ఆమెతట్టు బాగా చూడండి. ఆమెను చూడవలసిందికాదూ? లిండీదేవిగారూ! ఆమె అందంగా లేదూ?

లిండీ—అవును. ఆమె చాలా బాగుంది.

హెల్మ—ఏం చాలబాగా లేదూ? నృత్యందగ్గర ఆమెనుచూసి వాళ్ళందరూ అలాగే అన్నారు. కాని ఆమె కెప్పుడూ తనయిష్టమే చెల్లాలి. ఈముద్దుగుమ్మకి. మే మేంచెయ్యడం. మీరు చెప్పుతే నమ్మరు. నే నెంతో కష్టంమీద యిక్కడకు తీసుకొచ్చాను.

నోరా—నాథా! "మరొక్క గంటైనా అక్క డుండనిచ్చానుకానే" అని మీరే విచారిస్తారు.

హెల్మ—లిండీదేవిగారు వింటున్నారా? ఆవిడ టరంటెలానృత్యం చేసింది. ఆమెకోరినట్టే అది మిక్కిలి బాగుంది. ఆనాట్యం యిక్కడ ప్రత్యక్షంగా జరుగుతున్నట్టే అనిపించింది. కాని అనుకరణంలాగ యెంతమాత్రం అనిపించలేదు. కళలో కొన్నిలోపాలుంటే ఉంటాయి. దానికేం లెండి- ముఖ్యాంశమేమిటంటే; అనుకున్నకంటే అనేకరెట్లు బాగుంది. ఇంకా అక్కడామెనుండనిచ్చి, కలిగిన ఆనందాన్ని నశింపజేస్తానా? ఎంతమాత్రంచెయ్యను. నాఅందమైన కేప్రీకన్యను—నాపిచ్చి కేప్రీదేశపుకన్యను— నేనుతీసుకుని వెలిపోవచ్చాను.ఎత్తుకుని గదిలోనుండి ఒక్కదాటు దాటివచ్చాను. నవలలో చెప్పినట్టుగా అందమైన భూతమదృశ్యమైపోయింది. లిండీదేవిగారు! వెళ్ళిపోరావడం మంచిపని చేశాంకాదు. కాని దీన్నంతా నోరాకు బోధపడేటట్టు చెయ్యలేను, పాపం! ఈగది వేడిగానుంది. (తన అంగరఖాను కుర్చీమీద పారవైచి తనగదితలుపు తెరచును.) అయ్యో! ఇక్కడంతా చీకటిగానుంది. క్షమించండి. (అతడు లోపలికి పోయి కొన్నికొవ్వొత్తులు వెలిగించును.)

నోరా—(తొట్రుపాటుతో నిశ్వాసరహితమైన అవ్యక్తస్వరముతో) ఏమైంది?

లిండీ—(సన్నని స్వరముతో) నే నతనితో మాట్లాడేను.

నోరా—అతనితోనా మరి—

లిండీ—నోరా! దీన్నంతా నీభర్తతో నువ్వు చెప్పాలి

నోరా—(అవ్యక్తస్వరముతో) నాకు తెలుసును.

లిండీ—క్రోగ్‌స్టాడ్ విషయంలో నువ్వు జడవవలసిన పనిలేదు. కాని నీభర్తతో మాత్రం యిదంతా చెప్పాలి.

నోరా—నేను చెప్పను.

లిండీ—అయితే, ఆవుత్తరమే చెప్తుతుంది.

నోరా—సరే; క్రిస్టైనీ! ఇక నామట్టుకు నే నేంచెయ్యాలో నాకు తెలుసును. ఊరుకో—

హెల్మ—(తిరిగీ లోపలికివచ్చి) లిండీదేవిగారు! ఎలాగుంది ?

లిండీ—చాల బాగుంది. నే నిప్పుడు సెలవుతీసుకుంటాను.

హెల్మ—ఏమిటప్పుడే ? ఈనట్టు మీరు కుట్టిందేనా ?

లిండీ—(చేతితో పట్టుకొని చూచి) అవును. సెలవు తీసుకుంటాను. నే నిప్పుడు కుట్టడం మరిచిపోయాను.

హెల్మ—అయితే మీరు కుట్టగలరన్నమాట ?

లిండీ—అవును.

హెల్మ—మీరిక్కడ అంచు కుట్టవలసివుండెను.

లిండీ—అలాగా ? ఎందుకు ?

హెల్మ—అది చాల అవసరము. నేను చూపిస్తాను చూడండి. ఎడంచేత్తో ఇలాగు అంచుపట్టుకోండి. కుడిచేత్తో

ఇలాగు సూది పట్టుకొని కూర్చు పొయ్యండి. కనబడుతు న్నాదా ?

లిండీ——ఆఁ- అవును.

హెల్మ——కాని కుట్టువిషయంలో అది అంతఅందంగా నుండదు. చూడండి. రెండుచేతులు ముడుచుకుపోతాయి. మీ దా కిందాగూడా కుట్లువస్తాయి. వాళ్లిచ్చింది మంచిద్రాక్షా రసమే.

లిండీ——సరే. సెలవు. నోరా! ఇంకా మొండిపట్టుపట్టకు!

హెల్మ——బాగా చెప్పారు. లిండీదేవిగారు.

లిండీ——హెల్మరుగారు! సెలవు. నమస్కారము.

హెల్మ——(ద్వారందాక ఆమెతో వెళ్లి) నమస్కారము. నే నుంటాను. మీరింటికి క్షేమంగా చేరుకుంటా రనుకుంటాను. మీతో రావడం నాకు సంతోషమేగాని- మీరు వెళ్లవలసినదిచా లదూరంలేదు. ఉంటాను. (ఆమె వెడలిపోవును. ఆమె వెడలిన పిదప హెల్మరు తలుపుమూసి తిరిగీ లోనికివచ్చును.) అన్నా ! ఇప్పటికామెను వదలించు కున్నాము. అబ్బా, ఆవిడవస్తేసరి రామదంపు.

నోరా——నాథా ! మీరలసిపోలేదూ ?

హెల్మ——లేదు. ఎంతమాత్రంలేదు.

నోరా——నిద్రరైనా రావడంలేదా ?

హెల్మ—ఒకపిసరున్నా అంతేకాక నాకు మిక్కిలి ఉత్సాహంగాకూడా వుంది. నువ్వో ?. నువ్వలసిపోయినట్టు నిద్రవస్తున్నట్టూకూడా కనిపిస్తున్నావు.

నోరా—అవును. నే నలసిపోయాను. నాకు నిద్రపోవాలనుంది.

హెల్మ—చూశావా? ని న్నక్కడ నుండనియ్యకపోవడంలో నే నెంత మంచిపని చేశానో ?

నోరా—నాథా ! మీ రేదిచేసినా అదీ మంచికోసమే.

హెల్మ—(ఆమెనుదుటిపై ముద్దుపెట్టుకుంటూ) ఇప్పుడు నాముద్దులభరతపక్షి సవ్యంగా పలుకుతున్నాది. నేటిసాయంత్రం రాంక్ ఎంతసంతోషంగా నున్నాడో నువ్వుచూశావా ?

నోరా—నిజంగా ? ఆనందంగా నున్నాడా ? అతనితో నేను మాట్లాడనేలేదు.

హెల్మ—ఇంత ఆనందంగా అతన్ని నే నెప్పుడూ చూడలేదు. (ఆమెవైపొక క్షణముచూచి ఆమెదగ్గరకు పోవును.) మనమట్టుకు మనం యింట్లో ఎవరూలేకుండా, నీవొక్కర్తితో నే వుండడంనాకు చాల ఆనందం. నాముద్దుల మోహనాంగీ !

నోరా—అలాగు నాతట్టు చూడకండి నాథా !

హెల్మ—నాప్రియధనంవైపు నే నెందుకు చూడకూడదు ? ఆసౌందర్యమంతా నాదే. నాస్వంతం.

నోరా—(మేజారెండో ప్రక్కకు వెళిపోతూ) అటు వంటిమాట మీరు నాతో యివాళరాత్రి చెప్పకూడదు.

హెల్మరు—(ఆమెననుసరిస్తూ) ఇంకా నువ్వు టరంటలానృత్యంలోనే వున్నావు. అందుకనే నువ్వు మిక్కిలి మనోహరంగా నున్నావు. విను—వచ్చిన అతిథులు వెళిపోతున్నారు. (సన్ననిస్వరముతో) నోరా! ఒక్కక్షణంలో యీాగదంతా నిశ్శబ్దంగా నుంటుంది.

నోరా—అవును కాబోలు !

హెల్మరు—అవును నాముద్దులనోరా ! జ్ఞాపకముందా నీకు. పూర్వంమనంకొందరి స్నేహితులతో కలసి షికారువెళుతూ వుంటే నేను దూరంగానుండి, నీతో తర్చు మాట్లాడీవాణ్ణుకాను. అప్పుడప్పుడు నీ వైపొక దొంగచూపుచూస్తూ వుండీ వాణ్ణి. అదెందుకో నీకు తెలుసునా ? మనమిద్దరం రహస్యంగా నొకరి నొకరు ప్రేమించుచున్నామని, నువ్వునాకు ప్రధానంకాబడిన భార్యవనీ, మనసంబంధంగూర్చి ఎవరూ అనుమానించరనీ, నామట్టుకు నే ననుకునేవాడిని.

నోరా—అవునవును—నాకు తెలుసును. మీాతలపు లెప్పుడూ నామీాదనే వుంటాయి.

హెల్మరు—మనమొకరినొకరు బాసి పోయినప్పుడు, నీసుందరమైన అంసప్రదేశమునందు—నీసొగసైనకంఠసీమయందు—శాలువ కప్పుతూ అప్పుడు నే ననుకునేవాడిని. నువ్వు

నాముద్దుల యర్ధాంగి వనిన్నీ, మనమప్పుడేవివాహమునుండి వస్తున్నామనిన్ని, నిన్ను నేను గృహప్రవేశమునకు తీసుకొని వస్తున్నాననిన్నీ—నిన్నొక్కర్తనే నాపిరికిముద్దరాలను! ఈసా యంత్రంఅల్లా నిన్నుతప్ప నేను మరొకటి వాంఛించలేదు. టరంటలాయందలి అపవిత్రవేషములు చూచి నాదేహము మండింది. నేను మరి దాన్ని భరించలేక పోయాను—అందుకనే నిన్నింతవేగము తీసికొని వెళ్లిపోవచ్చాను.

నోరా—టోర్వాల్డు! మీరుపోండి. నన్ను పోనియ్యండి నేను రాను—

హెల్మరు—ఏమిటది? హాస్యము చేస్తున్నావా. నా ముద్దులనోరా? లేక నేను నీభర్తనుకానా—? (వీధితలుపు కొట్టుట వినబడును.)

నోరా—(ఉలికిపడి.) వింటున్నారా—?

హెల్మరు—(సావడిలోనికివెళ్లి) ఎవరది?

రాంక్—(వెలుపల) నేను. ఒక్కక్షణం నేను లోపలికి రావచ్చునా?

హెల్మరు—(భయపడుతూ చిన్నస్వరములో) ఈవేళ ప్పుడు అతనికేంగావాలి. (గట్టిగా) ఉండు తీస్తున్నాను. (తలుపు గడియ తీయును.) రా! మంచిపని చేసేవు, ఈవైపుకువచ్చి కూడా తిన్నగా అలాగు వెళ్లిపోకుండా.

రాంక్—మీగొంతుకలు వినబడ్డట్టయినాయి. మిమ్మల్నొకసారి చూడాలని అనిపించింది. (ఒక్కసారిగా అంతటను సింహావలోకనము గావించి) ఆహా! ఇవన్నీ తెలిసినగదులే. నువ్వుచాల అదృష్టవంతుడవు. మీరిద్దరు ఇక్కడ సౌఖ్యంగానున్నారు.

హెల్మరు—ఇవాళ మేడమీద నువ్వు చాల అందంగాను, ఆనందంగాను కనబడ్డావు.

రాంక్—అవును. ఎందుకు కనబడను? ఈప్రపంచకంలో మనుష్యులెందు కానందించకూడదు? జరిగినంతకాలమైనా? సారాయము చాల బాగుంది.

హెల్మరు—అవు నన్నిటికంటే ద్రాక్షారసం చాల బాగుంది.

రాంక్—నువ్వుకూడ అలాగే అన్నా. నేను మానీడానికి యెంతప్రియత్నం చేశానో నువ్వు నమ్మవు.

నోరా—ఈరాత్రి టోర్వాల్డుగారుకూడా ద్రాక్షారసం చాల త్రాగేరు.

రాంక్—నిజంగా?

నోరా—అవును. అప్పటనుండి వారి కానందంగానేవుంది.

రాంక్—రోజంతా కష్టపడి తరువాత ఎవరైనా సరే రాత్రి ఎందుకు కానందించకూడదు.

హెల్మరు—కష్టపడిన తరువాత ! ఆమాట నాకు వర్తిం చదను కుంటాను.

రాంక్—(అతని వీపుమీద తట్టుతూ) కాని నాకు తె లుసును. వర్తిస్తుంది.

నోరా—డాక్టరుగారూ ! మీ రీరాత్రి యేదో శాస్త్ర పరిశీలనలో నిమగ్నమై పోయినట్టున్నారు.

రాంక్—అవు నలాగే.

హెల్మరు—విను. విను. ముద్దులనోరా, శాస్త్రపరిశీల న గురించి మాట్లాడు తున్నాది.

నోరా—అందుకు మిమ్మభినందించ మన్నారా ?

రాంక్—నీయిష్టం.

నోరా—అయితే మీకిష్టమేనా ?

రాంక్—తప్పకుండా—వైద్యుడికీ రోగికీకూడా మం చిదే.

నోరా—(తొందరగా పరిశీలనాదృష్టితో) నిశ్చయం గానా ?

రాంక్—ముమ్మాటికిన్నీ. అందుచే ఈసాయంత్రం ఆనం దంగా గడపడానికి నాకు హక్కు లేదూ ?

నోరా—డాక్టరుగారు! లేకేం. ఉన్నాది.

హెల్మరు—నేను కూడా అలాగే అనుకుంటాను. దా నికి తగిన ప్రతిఫలం తెల్లవారగానే అనుభవించ కుండావుంటే.

రాంక్—సరి. సరి. ఈజీవితంలో ప్రతిఫలం లేకుండా యేమీలేదు.

నోరా—డాక్టరుగారు మీకు నర్తనప్రదర్శనం చాల యిష్టమా ?

రాంక్—ఆఁ. రకరకాల దుస్తులు, వేషాలు వుంటే.

నోరా—వచ్చేప్రదర్శనంలో మనమిద్దర మెలాంటి వేషాలువేసి యేయే దుస్తులు ధరించాలో చెప్పండి ?

హెల్మరు—అయ్యో ! తుంటరిదానా ! అప్పుడే వచ్చే ప్రదర్శనం గూర్చి ఆలోచిస్తున్నావా ?

రాంక్—మనమిద్దరమున్నా ? సరే చెప్తాను. నువ్వొక దేవతవేషం వేద్దువుగాని—

హెల్మరు—సరే. దానికి తగిన దుస్తులేమిటి చెప్పావు?

రాంక్—నీభార్య రోజూ ఏబట్టలు కట్టుకుంటున్నాదో అవే కట్టుకుని వెళ్లనీ.

హెల్మరు—అవును. చాలాబాగా చెప్పావు కాని నీ సంగతేమిటో చెప్పేవుకావు ?

రాంక్—నామట్టు కప్పుడే నే నేదో ఆలోచించుకున్నాను.

హెల్మరు—ఏమిటది ?

రాంక్—మళ్లీ నర్తనప్రదర్శనంనాటికి నేను కనబడను.

హెల్మరు—చాలా మంచివేషమే !

రాంక్—ఒకపెద్దనల్లనిటోపీవుంది—నువ్వు మనుష్యులా నదృశ్యం చేసేటోపీసంగతి వినలేదూ ?

హెల్మరు—(నవ్వాపుకుంటూ) అవును నువ్వు బాగా చెప్పేవు.

రాంక్—కాని నే నెందు కొచ్చానో నేను మరిచిపోయాను. హెల్మర్! నాకొకచుట్ట యియ్యిమీ—మంచిపాటాకుచుట్ట.

హెల్మరు—ఎంతో సంతోషంతో. (చుట్టపెట్టె నతని చేతికిచ్చును.)

రాంక్—(ఒకచుట్టతీసి దాని కొసను గోసివేయును.) నమస్కారము.

నోరా—(అగ్గిపుడక వెలిగించి) ఇందండి. ముట్టించండి.

రాంక్—నీకుకూడా వందనములు. (అతడు చుట్ట వెలిగించుకున్నదాకా ఆమె అగ్గిపుడక పట్టుకొనును.) సెలవు.

హెల్మరు—మంచిది. మంచిది. ప్రియమిత్రమా !

నోరా—డాక్టరుగారూ ! చక్కానిద్రపోండి.

రాంక్—నీకోరికకు చాల సంతోషము.

నోరా—నాకుగూడా అట్టిది కోరండి.

రాంక్—నీకున్నా ? నన్ను బాగా పడుకోమన్నావు. ! నువ్వగ్గిపుడక వెలిగించినందుకు వందనములు. (అతడు తలనూచి వెడలిపోవును.)

హెల్మరు—(చిన్న గొంతుకతో) అతడు రోజూకంటె హెచ్చు తాగేశాడు.

నోరా—(పరధ్యాన్నంగా) అయుంటెంది. (హెల్మరు చేతితో నొక తాళపుగుత్తి పట్టుకొని సావడిలోనికి పోవును.) నాథా! ఎక్కడికి వెళుతున్నారు?

హెల్మరు—ఉత్తరాలపెట్టె ఖాళీచేద్దామని. అది నిండా నిండిపోయింది. రేపుప్రొద్దుట వార్తాపత్రిక వెయ్యడానికి జాగా లేదు.

నోరా—ఈరాత్రి యింకా మీరు పనిచేస్తారా?

హెల్మరు—చెయ్యను. చెయ్యను. నీకు తెలియదూ! ఇదేమిటిది? ఎవరో కప్పతియ్యడానికి ప్రయత్నంచేశారు?

నోరా— తాళంకప్పా?

హెల్మరు—అవును. ఎవరో. కాని దీని అర్థమేమిటి? దాసీ తీసిందనుకోడానికి వీలులేదు. ఇదిగో ఇక్కడొక శిఖసూది విరిగిపోయింది. నోరా! అది నీదానిలాగేవుంది.

నోరా—(తొందరగా) అయితే పిల్లలై యుంటారు.

హెల్మరు—నువ్వు వాళ్ల నిటువంటిచేష్టలు చెయ్యని య్యకూడదు. అన్నా! తాళమెలాగో తీశాను. (ఉత్తరాల పెట్టెలోనున్నవానిని తీసి వంటయింటివైపుచూచి పిలచును) హెలన్. హెలన్. వీధిగుమ్మం దగ్గరున్న దీపమార్పు. (తనగది లోనికిపోయి సావడిలోనికున్న తలుపును మూసివేయును. చే

తులనిండా వుత్తరములుపట్టుకొని చేతులు చాచును) చూడు. ఎన్నున్నాయో ! (వాటినిచూస్తూ) ఇదేమిటిది ?

నోరా—(కిటికీవద్ద) ఉత్తరమా !- కాదు టోర్వాల్డు! కాదు.

హెల్మరు—రెండుకార్డులు రాంక్ వద్దనుండి.

నోరా—రాంక్ వద్దనుండా ?

హెల్మరు—(వానితట్టుచూసి) డాక్టరురాంక్! అవి మీాదనున్నాయి. అతడు వెళ్ళిపోయేముందు వేసి వుంటాడు.

నోరా—వాటిలో నేమైనా వ్రాసివుందా ?

హెల్మరు—అతని పేరుమీాద నల్లని అడ్డుగురుతున్నాది. చూడు ఎటువంటి విచారకరమైన ఆలోచనో ? అతడు తన మరణాన్ని సూచించినట్టు కనిపిస్తున్నాది.

నోరా—అతడిప్పుడు చెయ్యబోయేది అదే.

హెల్మరు—ఏమిటి ? దాని గురించి నీకేమైనా తెలుసునా ? నీతో యేమైనాచెప్పాడా ?

నోరా—అవును. ఆకార్డులు మనదగ్గరకు వస్తే అదే మనదగ్గిరనుండి సెలవు తీసుకోడమని చెప్పాడు. అతడు తలుపు వేసుకొని ప్రాయోపవేశం చేస్తాడుకాబోలు.

హెల్మరు—అయ్యో ! నాస్నేహితుడా ! నాకు తెలుసును. అతడు చాలకాలం బ్రతుకడని. కాని యింతవేగమా. అయితే ఒకవింతజంతువులాగు దాగుంటాడు.

హెల్మరు—అవునవును. అది మనలనిద్దరినీ బాధించింది. మనయిద్దరకుమధ్యను ఏదో వికృతమైంది ప్రవేశించింది. మరణ వేదనగూర్చి తలచుకోడంచేత మనమెలాగైనా దీన్ని బాపుకోవాలి. అప్పటిదాకా- మనం ఎవరిగదికివాళ్లం వెళ్లిపోదాము.

నోరా—(అతని మెడమీాద చేరబడి) ఆలాగే వెళ్లండి.

హెల్మరు—(ఆమె నుదుటిపై ముద్దుపెట్టుకుంటూ) సరే. నావసంతకోకిలా! చక్కాపడుకో. నోరా! నాపుత్త్రరాలు నేను చదువుకుంటాను. (అతడు ఉత్తరాలు తీసికొని తన గదిలోనికిపోయి తలుపుమూసివేయును.)

నోరా—(చీకటిలో నిటునటు వెదకుతూ హెల్మరు యొక్క అంగరఖాపట్టుకొని తనమొగంమీాద కప్పుకొని తొందరతొందరగా బొంగురుగొంతుకతో ఉండీ ఉడిగీ వినీవినిపించనట్లు తనలోతాను పలవరించును.) అతన్ని మరిచూడకూడదు. ఎప్పటికీ ఎప్పటికీ (ఆమె తనశాలువను తనతలపై కప్పుకొనును.) నాపిల్లలను చూడకూడదు. తిరిగీ ఎప్పటికైనను- ఆహా! ఆ మంచుతో కప్పబడిన నల్లనినీరు- ఎన్నరానిలోతు- ఇదైపోతే సరే! అదిగో యిప్పుడు తీశారు- చదువుతున్నారు. టోర్వాల్డు నకు నాబిడ్డలకు స్వస్తి. (ఆమె సావడి గుండాపరుగెత్తి పోవుటకు సిద్ధముగా నుండును. అప్పుడు హెల్మరు తొందరతొందరగా తనతలుపుతీసి ఒకవుత్తరం పట్టుకొని నిలబడును.

హెల్మరు—నోరా!

నోరా—ఆఁ !-

హెల్మరు-—ఇదేమిటిది ? ఈవుత్తరములో నున్నదేమిటో నీకు తెలుసునా ?

నోరా—ఆఁ. నాకు తెలుసును. నన్ను వెళ్ళిపోనియ్యండి. వెళ్ళిపోనియ్యండి.

హెల్మరు—(ఆమె వెళ్ళిపోకుండాపట్టుకొని) ఎక్కడికి వెళ్ళిపోతున్నావు ?

నోరా—(విడిపించుకొనప్రయత్నంచేస్తూ)మీరు నన్ను రక్షించకండి.

హెల్మరు—(వెనక్కుతిరిగి) నిజమేనా? నేను చదివిన సంగతినిజమేనా ? దారుణము ! లేదులేదు. అసంభవము. అలా జరిగుండదు.

నోరా—నిజమేను. మిమ్ము నేనంతగాఢంగా ప్రేమించాను.

హెల్మరు—చాలులే. ఇటువంటిపనికిమాలిన సమాధానాలు చెప్పకు.

నోరా—(అతనివైపు ఒకఅడుగుపెట్టి) టోర్వాల్డు—

హెల్మరు—దౌర్భాగ్యురాల ! ఏమిటిచేశావు ?

నోరా—నన్ను పోనియ్యండి. నాగురించి మీరు బాధపడనద్దు మీరేమి భారం వహించకండి.

హెల్మరు—మ రేమివేషాలుపడిపోకు (సావడితలుపుతాళము వేయును.) ఇక్కడ నువ్వుండి నాకు తగినసమాధానం చెప్పం. నువ్వేమిచేశావో నీకు తెలుసునా ? జవాబుచెప్పవేం! నువ్వేమిచేశావో నీకు తెలుసునా?

నోరా—(అతనివైపు నిదానించిచూస్తూ ఆమెపలుకులవల్ల క్రమక్రమముగా నామెముఖమునందలి వికాసవిహీనత తెలియజేయును.) అవును. నాకిప్పుడదంతా బాగా తెలుస్తున్నాది.

హెల్మరు—(గదిలోనిటునటుపచారుచేస్తూ) ఎట్టిదారుణప్రబోధము ఈ యెనిమిదిసంవత్సరాలై - నాసంతోషగర్వాతిశయములకు కారణమైనది—ఒక కుత్సితస్వభావ—అసత్యవాది—దొంగకన్నాతక్కువ—అనిర్వచనీయమైన దారుణశూలము—అవమానము. అవమానము. నోరా నిరుత్తరయై యాతనివైపు నిదానించిచూచును. (అతడామెముందునాగి) ఇట్టిదేదో జరుగుతుందని నేననుమానించవలసింది. నేను ముందాలోచించవలసివుండెను. నీతండ్రికేమీాకట్టుదిట్టము లేకపోవడము నిన్నింతకు తెచ్చింది. ఒకమతమూ, ఒకనీతా, కర్తవ్యతాబాధ్యతా, ఏమీలేదు. శుద్ధశూన్యం—దాన్ని నేను చూసీచూడనట్లు ఊరుకోడంచేత నాకెలాంటిశిక్షైంది. అదంతా నీకోసంచేశాను. ఆచేసినదానికి ప్రతిక్రియ యిది.

నోరా—అవునదేను.

హెల్మరు—ఇప్పుడు నువ్వు నాఆనందాన్నంతా నాశనం చేశావు. నాకు ముందుకుకలగబోయే లాభాన్ని నాశనం జేశావు. అదంతా తలుచుకుంటే భయంవేస్తున్నాది. నేనిప్పుడు నీతిమాలిన ఒకకార్పణ్యపుమనిషిచేతిలో చిక్కాను. వానికేదిష్టమైతే అదిచేస్తాడు. వానికేదికావలిస్తే అది అడుగుతాడు. వానికెలాగుబుద్ధిపుడితే అలాగాజ్ఞాపిస్తాడు—నేను కాదనడానికి వీలులేదు. అనాలోచనపరురాలైన ఒకకాంతకారణముచే నేనుదుఃఖభాజనమైన పాతాళలోకమునకు క్రుంగిపోవాలి.

నోరా—నే నిక్కడనుండి పోతే మీకిదంతా తప్పిపోతుంది.

హెల్మరు—ఇటువంటి మిసిమిమాటలుతీసీ. మీనాన్న కూడా యిటువంటివనేకం చెప్పేవాడు. నువ్వన్నట్టు నువ్వువెళ్లిపోతేమాత్రం నాకేంలాభం? ఏమీలేదు. వాడదిలోకమంతా వెల్లడిచేసేస్తాడు. వాడలాగుచేస్తే నువ్వుచేసినదానిలో నేనుకూడావున్నానని—అసలుదీనికిప్రోత్సాహం చేసినవాడిని నేనే అని అనుకుంటారు. దీనికంతటికి నిన్ను నే నభినందించవలసివుంటుంది—నాసంసారసౌఖ్యకాలమంతా ఎవరిని ప్రేమించానో, అట్టినువ్వు, నాగురించి యేమిటిచేశావో తెలిసిందా ?

నోరా—(వికాసరహితంగా, నెమ్మదిగా) తెలిసింది.

హెల్మరు—నే నది నమ్మడానికి తగనంత సందేహాస్పదంగానుంది. మనమిద్దర మేదోసమాధానానికిరావాలి. శాలూతీసీ-

తీసేమని చెప్పుతూవుంటే, వానిని నే నెలాగో బోధపర్చుకోవాలి. ఎలాగైనా దీన్నంతా కప్పిపెట్టాలి. మనయిద్దరివిషయంలో పూర్వం యెలాగుందో, యిప్పుడూఅలాగేవుండాలిపైకి—ప్రపంచకానికంతటికీ. నువ్వేలాగూ నాయింట్లోనే ఉందూగానిదానికేం. కాని పిల్లలసంరక్షణమాత్రం నువ్వుచెయ్యవద్దు. నిన్ను నేను నమ్మను. నేను గాఢంగాప్రేమించినవనిత కిలాగుచెప్పడం. ఎవరైతే యిప్పటికిన్నీ నేను— లేమ. అదంతాసరి. ఇంతనుండిమనకు కావలసినది ఆనందంకాదు. మనంచెయ్యవలసినదల్లా పోయిన ప్రతిష్టనిలుపుకోడమే. అంతమాత్రం లోకానికాసంబంధం కనబడ్డట్టు—(వీధిద్వారంవద్ద గంటమ్రోగును.)

హెల్మరు—(ఉలికిపడి) ఏమిటిది ? ఇంతరాత్రప్పుడు ? ఏదోవుపద్రం—? అతడే—? నోరా! నువ్వొకప్పేసుకో. నీవంట్లో బాగులేదనిచెప్పు.

(నోరా నిశ్చలముగా నిలబడును. హెల్మరుపోయి సావడితలుపుతాళముతీయును.)

దాసి—(బట్టకట్టుకుంటూ ద్వారమువద్దకు వచ్చును.) అమ్మగారికొకజాబువచ్చింది.

హెల్మరు—తే. నాకిచ్చి. (ఉత్తరంతీసుకొని తలుపు మూసివేయును.) అవును. వానిదగ్గరనుండే. ఇదినీకివ్వను. నేనుచదువుతాను.

నోరా—సరే చదవండి.

హెల్మరు—(దీపందగ్గరనిలబడి) చదవడానికి నాకు ధైర్యంచాలకుండావుంది. మనయిద్దరినీ నాశనంచేస్తుందేమో. లేదు. చదువుతాను. (ఉత్తరమునువిప్పి కొద్దిపంక్తులు చదివి దానితో పంపినకాగితమునుచూచి సంతోషముతో నరచును) నోరా! నోరా! (ఆమె అతనివైపు "ఎందుకని" ప్రశ్నించునట్లుచూచెను.) నోరా! తిరిగీ నేను మరొకసారిచదువుతాను— అవును. నిజమే. నేను బ్రతికాను నోరా! నేను బ్రతికాను.

నోరా—మరి నేనో ?

హెల్మరు—నువ్వుకూడాను. మనిద్దరం బ్రతికాము. నువ్వూ నేనున్నూ, ఇదిగో నీదస్తావేజు నీకుతిరిగీ పంపివేశాడు. ఇదివరలో జరిగినదానికి తాను విచారిస్తున్నానని—పశ్చాత్తాప పడుచున్నానని—తనజీవితంలో నొకమార్పువచ్చిందని—ఏమేమో వ్రాశాడు. దానిమాటకేంలే. మనంమాత్రం బ్రతికాము నోరా! ఇకను మననెవ్వరు ఏమీచెయ్యలేరు. ఓహో! నోరా! నోరా! - లేదు. మొదట నీయసహ్యకరమైన వస్తువులను కాల్చివెయ్యాలి. ఏదీ - (దస్తావేజువైపొకసారిచూచి) ఛీ! ఛీ! చూడకూడదు. ఇదంతా ఒకపీడకలలాగుంది. (ఉత్తరాలను దస్తావేజునుచింపి వెలుగుతున్న స్టవ్వులో పడవైచి కాలుట చూచుచుండును.) అన్నా- అది మరేంలేదు. క్రిస్టమస్ ముందు నాటినుండీఅని వ్రాశాడు. ఈమూడురోజులలో నువ్వెంత ఆందోళనపడి కష్టపడ్డావో నోరా!

నోరా—ఈమూడురోజులూ నేను హాహాకారాలు గా పోరాను.

హెల్మరు—తప్పించుకునే మార్గం తెలియక యెంత బాధపడేదానివోకాని- అదంతా మరెందుకు మళ్ళీ తలుచుకోడం. అదంతా అయిపోయిందని సంతోషంతో చప్పట్లు కొట్టుకుందాం. రా. నోరా! నామాటవిను. అదంతా అయిపోయిందంటే నువ్వు నమ్మనట్లు కనిపిస్తున్నాది. ఏమిటిది?- ఈవికాసవిహీనమైన మొగమేమిటి? అయ్యో! పాపిచ్చిదానా! నాకిప్పుడు తెలిసింది. నేను క్షమించానని యింకా నువ్వు నమ్మవుగదా! కాని అది సత్యము. నేను ప్రమాణంచేస్తాను. నమ్ము. నిన్ను నేను క్షమించాను. నాకు తెలుసును. నువ్వు చేసినదంతా నాయందలి ప్రేమచేతనే.

నోరా—అది నిజము.

హెల్మరు—భార్య భర్తను ఎలాగు ప్రేమించాలో అలాగు నువ్వు నన్ను ప్రేమించావు. అయితే అదియెలాగుచెయ్యాలో తెలుసుకోడానికి నీకు తగినంత ఆలోచన లేకపోయింది. ఆకారణంచేత నీయందు నాకేమీ ప్రేమతగ్గిందనుకుంటూవా? నీ పూచీమీద ఎలాగు నిర్వర్తించడమో నీకు తెలియకపోవడం చేత?కాదు. ఎంతమాత్రంకాదు. రా. నామీద చేరబడు. ఎలాగు చెయ్యాలో నేను సలహాచెప్తాను. ఈఅబలలకుండవలసినసహజమైన అసహాయత్వముచేత నువ్వునాకు మరింత ఆనందం కలగ

జెయ్యకపోతే నేను పురుషుడనేకాను. మనలను ఇదంతా ముం చేస్తుందేమోఅని భయంచేత నేనాడిన నిష్ఠురోక్తులను నువ్వెంత మాత్రం మనసులో నుంచుకోకు. నేను నిన్ను క్షమించాను నోరా! నిన్ను నేను క్షమించినట్టు ప్రమాణం చేస్తున్నాను.

నోరా—మీరు క్షమించినందుకు మీ కనేకవందనములు.

(ఆమె ద్వారముగుండా కుడివైపుపోవును.)

హెల్మరు—వద్దు. వెళ్ళకు. (లోపలివైపు చూచును.) లోపల ఏమిటిచేస్తున్నావు ?

నోరా—(లోపలినుండి) నావేషం విప్పేస్తున్నాను.

హెల్మరు—(తెరచిన ద్వారమువద్ద నిలబడి) అవునలాగుచెయ్యి. నీమట్టుకునువ్వు శాంతిపొంది మనస్సు స్థిమితపరుచుకో. నాపిరికికోకిలా! విశ్రాంతి తీసుకో. నెమ్మదిగానుండు. నిన్ను సంరక్షించడానికి నాకు పెద్దరెక్కలున్నాయి! (గుమ్మమువద్ద వెనుకకూ ముందుకూ పచారుచేయును.) మనయింట్లో, యిక్కడెంతవెచ్చగాను హాయిగానువుందో. నోరా! ఇదిగో నీవిశ్రాంతిస్థలము. డేగనుండి రక్షింపబడిన పావురాపిట్టలాగు ఇక్కడ నిన్ను రక్షిస్తాను. ఆందోళనచే కొట్టుకుంటూవున్న నీ గుండెకు శాంతిచేకూరుస్తాను. అది క్రమక్రమముగా తగ్గుతుంది. నామాటనమ్ము నోరా! రేపుప్రొద్దుట యిదంతా మారిపోతుంది. పూర్వం ఎలాగుందో అలాగేవుంటుంది. అప్పుడు నేను

క్షమించానని నీకు మరిచెప్ప నక్కరలేదు. నీమట్టుకు నీకే తెలుస్తుంది. నేను నిన్ను విడిచిపెట్టేస్తానని గాని, లేదా నిన్నేమైనా అంటానని గాని అనుకున్నావా? మగవారి మనసెట్టిదో నీకు సరీగా తెలియదు నోరా! తనభార్యను క్షమించడంలో—హృదయపూర్వకంగా, యేమీఅనకుండా క్షమించడంలో—వర్ణించ నలవికాని మధురతరానందం మగవారికి కలుగుతుంది. ఆమెను పూర్తిగా తనసొత్తు చేసుకున్నట్టే ఆమెకు నూతనజీవితమిస్తాడు. అప్పుడొకవిధంగా నామె, అతనికి భార్యగాను బిడ్డగాను కూడా వుంటుంది. నాచకితవిహంగమా! నిస్సహాయురాల! ఇప్పుడు నువ్వు నాకలాంటిదానివే. దానిగూర్చి యేమి చింత పెట్టుకోకు. నాకు నిష్కపటంగా నీహృదయమిచ్చి. అప్పుడు నీకు బుద్ధిగాను ఆలోచనగాను కూడానుంటాను. ఇదేమిటిది? ఇంకా పడుకోలేదు? నీబట్టలను మార్చుకున్నావా?

నోరా—(సాధారణపు దుస్తులతో) ఆఁ! నాదుస్తులను మార్చుకున్నాను టోర్వాల్డు!

హెల్మరు—కాని యెందుకేమిటి? - ఇంతరాత్రప్పుడు?

నోరా—నే నీరాత్రి నిద్రపోను.

హెల్మరు—కాని యీవేషమేమిటి నోరా!

నోరా—(తనవాచీతట్టుచూచి) ఇంకా చాలరాత్రి కాలేదు. టోర్వాల్డు! ఇక్కడకూర్చో. మన మొకరికొకరకము

చెప్పుకోవలసినది చాలవుంది. (ఆమె మేజామీాద నొకప్రక్క నుకూర్చొనును.)

హెల్మరు—నోరా! - ఇదేమిటిది? ఈవికాసవిహీనమైనమోమేమిటి?

నోరా—కూర్చోండి. చాలసేపుపడుతుంది. నేను మీాతో చాలచెప్పాలి.

హెల్మరు—(ఆమెకెదురుగా మేజాపైకూర్చుండును.) నిన్ను చూస్తే నాకు భయంవేస్తున్నాది. నోరా! నీసంగతేమిటి నాకు బోధపడలేదు.

నోరా—లేదదేనూ. నాసంగతి మీాకు బోధపడలేదు. మీాసంగతి నాకు బోధపడలేదు. ఈరాత్రివరకు. వద్దు మధ్య నాపకండి. నేను చెప్పేదంతా వింటూవూరుకోండి. టోర్వాల్డు! ఇంతతో మన మొకరికొకరము తెగతెంపులు చేసుకోవలసిందే.

హెల్మ—నువ్వన్నమాటకు నాకర్థంకాలేదు.

నోరా—(కొంచెముసేపూరకొని) మన మిద్దరం యీలాగు కూర్చోడంలో మీాకేమీావింత కనబడలేదూ?

హెల్మ—ఏమిటది?

నోరా—మన వివాహమై యెనిమిదిసంవత్సరాలైంది. ఇప్పటికరకు మనమొకసారైనా భార్యాభర్తలలాగ మనసు విడిచి సంభాషించుకున్నామా? ఇదే మొదటిసారికాదా?

హెల్మ—మనసువిడిచి అంటే నీఅర్థం యేమిటి?

నోరా—ఈ యెనిమిదిసంవత్సరాలనుండి- మన మొకరి నొకర మెఱిగి అంతకంటే లావే అవుతుంది—మన మొక్కసారైనా ముఖ్యమైన యేహాంశంగురించి గాని మాట్లాడుకోలేదు.

హెల్మ—నీకు తెలియనవసరములేని ప్రతీచిన్నవిషయం గూడా నీతో చెప్పి నీతల బద్దలచెయ్యమన్నావా ?

నోరా—మీాకచీరీసంగతి గురించి నేను మాట్లాడమనలేదు. ఒకరిహృదయాంతరాళంలో నున్న విషయాన్ని ఒకరు తెలుసుకోవాలని ఉత్సాహంతో ఒకనాడైనా కూరుచున్నామా ? లేదు.

హెల్మ—కాని ప్రియా ! నోరా ! దానివల్ల నీకేమి లాభము ?

నోరా—అదేను. మీారు నన్నెప్పుడూ తిన్నగా బోధపర్చుకోలేదు. నన్ను మీా రన్యాయంచేశారు. టోర్వాల్డ్—మొదట అప్పగారు తరువాత మీారు.

హెల్మ—ఏమిటి ? మే మిద్దరమున్నా ? ప్రపంచంలో అందరికంటే నిన్ను హెచ్చుగా ప్రేమించిన మే మిద్దరమున్నా ?

నోరా—(తల నడ్డముగా నూపుచు) మీారు నన్నెప్పుడూ ప్రేమ్మించలేదు. నాతో స్నేహంగా నుండడమే మీాకానంద మనుకున్నారు.

హెల్మ—నోరా! ఎటువంటిమాటలు నీనోట విం టున్నాను.

నోరా—టోర్వాల్డు! అది ముమ్మాటికి సత్యము. నేను అప్పగారివద్ద నున్నప్పుడు, ఆయన అన్నిటినిగూర్చి తనవుద్దేశ మును చెప్పుతూ వుండేవారు. అందుచే నాకూ ఆవుద్దేశమే వుండేది. ఒకవేళ వుద్దేశభేదమున్నా అతని కిష్టంగా నుండదని నేను తెలియబరిచేదాన్నికాను. అతను నన్ను బొమ్మపిల్లా అని పిలిచేవాడు. నేను బొమ్మలతో ఆడుకున్నట్టే అతను నాతో ఆడు కునీవాడు. నేను మీతో కలిసివుండడానికి వచ్చిన తరువాత—

హెల్మ—మన వివాహాన్నిగూర్చి యెటువంటి మాట వుపయోగించావు?

నోరా—(అచంచలంగా) అంటే నావుద్దేశము అప్ప గారి చేతుల్లోనుండి మీచేతుల్లోకి బదిలీచెయ్యబడ్డానని మీ రంతా మీయిష్టానుసారంగా యేర్పాటు చేసేవారు మీఅభి రుచిప్రకారం. కాబట్టి నాకూ అదే అభిరుచి. ఒకవేళ నాకిష్టం లేకపోయినా యిష్టమున్నట్టు నటించేదాన్ని. ఒక్కొక్కప్పు డిలాగ ఒక్కొక్కప్పుడలాగ. ఇదంతా ఆలోచించుకొని చూస్తే నాజీవితమంతా కూటికీ గుడ్డకీ కష్టంమీద గడుస్తున్న నిరుపేదరాలి జీవితంలాగుంది. టోర్వాల్డు! మీకోసం నే నీవి ద్యలు చెయ్యడానికున్నట్టే కనిపిస్తున్నాది. కాని మీకదే చాల యిష్టం. మీరున్ను అప్పగారున్నూ నాయెడ గొప్పఅపచారం

చేశారు. నాజీవితంలో నే నేమి సమకూర్చుకో లేకపోవడం మీాదోషమే.

హెల్మరు—ఇవి యెట్టి అసందర్భపుమాటలు. ఎట్టి కృతఘ్నత! నోరా! ఇక్కడ నువ్వు సౌఖ్యంగా లేవా?

నోరా—లేను. ఇక్కడ నే నెప్పుడూ సౌఖ్యంగా లేను. సౌఖ్యంగా నున్నాననుకునేదాన్ని. కాని నిజంగా నే నెప్పుడూ అలాగుండడం లేదు.

హెల్మ—లేవు? సౌఖ్యంగా లేవు?

నోరా—లేను. ఆనందంగా మాత్రమేవుండేదాన్ని. మీారు నాయందు మిక్కిలి దయగా నుండేవారు. కాని మనయిల్లు ఆటభూమిలాగు మాత్రమే వుంది. నే నింటివద్ద అప్పగారి బొమ్మ పిల్లలాగ ఎలాగున్నానో, అలాగే నేను మీాకు బొమ్మపెండ్లాములా గున్నాను. ఇక్కడ నీపిల్లలే నా బొమ్మలు. పిల్లలు నాతో ఆడుకుంటే వారి కెలాంటి సరదాగా నుండేదో, ఆలాగే మీాతో ఆడుకుంటే నాకు సరదాగానే వుండేది. టోర్వాల్డు! ఇది మన వివాహఫలితము.

హెల్మ—నువ్వు చెప్పినదానిలో కొంచెం సత్యముంది చాలమట్టుకు అతిశయోక్తియైనా. కాని యికముందునుండి యిలాగుండదు. ఆటకాలం ముగిస్తుంది. అధ్యయనకాలం ప్రారంభిస్తుంది.

నోరా—ఎవరి అధ్యయనకాలము? నాదా? పిల్లలదా?

హెల్మ—నీదీ నీపిల్లలదీ కూడాను నాముద్దులనోరా!

నోరా—అయ్యో! టోర్వాల్డు! భార్యా ఎలాగువర్తించాలో నాకు చెప్పి దిద్దడానికి నువ్వెవడవు?

హెల్మ—ఆమాట చెప్పగలవు!

నోరా—నేనా- పిల్లలను పెంచడానికి నేనుమాత్రం ఎలాగుతగుదును.

హెల్మ—నోరా!

నోరా—ఒకగడియక్రిందట నువ్వామాట చెప్పలేదు? నన్నునమ్మి పిల్లలను సంరక్షణలో నుంచనని?

హెల్మ—కోపంవచ్చి అంటే ఆమాటకంతపట్టింపా?

నోరా—అవును. నువ్వు చెప్పినదినిజమే. నే నాపనికి తగను. నేనుచెయ్యవలసినపని యింకా మరొకటుంది. నామట్టుకు నేనే విద్యనభ్యసించాలి- ఈవిషయంలో నీసహాయం నాకక్కరలేదు. నామట్టుకు నేనే విద్యనభ్యసించాలి. ఆకారణం చేతనే నిన్ను ఇప్పుడు నేను విడిచి పెట్టేస్తున్నాను.

హెల్మ—(ఒకగెంతు గెంతి) ఏమిటన్నావు?

నోరా—నన్నుగూర్చి నాకుతెలియాలంటే నే నొక్కర్తెనే వుండాలి. ఆకారణంచేతనే నేను నీతో మరి వుండజాలను.

హెల్మ—నోరా! నోరా!

నోరా—ఇప్పుడే యీక్షణమే నీయింటనుండి వెళ్లిపోతున్నాను. నే నీరాత్రి క్రిస్టైనీయింట్లో వుంటాను.

హెల్మ—నీకు పిచ్చెత్తింది. నేను నిన్ను వెళ్లనివ్వను. వెళ్లొద్దు.

నోరా—ఇక నన్ను వెళ్లవద్దంటే యేమీలాభము లేదు. నావస్తువులేవో నేను పట్టుకుపోతాను. ఇప్పుడుగాని యిక పైని గాని, నీవద్దనుండిమాత్రం నే నేమీ తీసుకువెళ్లను.

హెల్మ—ఇదేమిపిచ్చే ?

నోరా—రేపు నే నింటికి వెళ్లిపోతాను-అంటే నాముసు పటింటికి. అక్కడ నాకు కావలసిన పని చేసుకుంటాను.

హెల్మ—తెలివిమాలిన గుడ్డిదా !

నోరా—నేను కొంచెం తెలివిని సంపాదించుకోవాలి. టోర్వాల్డు!

హెల్మ—నీయిల్లూ, వాకలి, మొగుడూ, పిల్లల్ని వది లీడానికా ? లోకు లేమిటనుకుంటారో కొంచెమైనా ఆలో చించవు?

నోరా—అదంతా ఆలోచించడానికి నాకు వేళ లేదు. నాకేదికావాలో నాకు తెలుసును.

హెల్మ—గుండె పగిలిపోతుంది. నీపవిత్రమైన విధులు నిర్వర్తించడం మానేస్తావు.

నోరా—నాపవిత్రమైన విధులేమిటనుకుంటావు ?

హెల్మ—అవి తిరిగీ నేను చెప్పాలా ! నీభర్తయెడను నీబిడ్డల యెడను నువ్వు నిర్వర్తించవలసిన పవిత్రమైనవిధులు లేవా ?

నోరా—అంతకంటే పవిత్రమైన విధులున్నాయి.

హెల్మ—లేవు. అవేవి.

నోరా—నాయెడ నేను నిర్వర్తించవలసినవిధి.

హెల్మ—అన్నిటికంటే నువ్వుముఖ్యం భార్యవు. తల్లివి.

నోరా—దానిని నేనేమాత్రం నమ్మను. నేనూ నీలాంటిమనిషినే అనిన్నీ- కాకపోతే యెలాగైనా మనిషిని కాడానికి ప్రయత్నించవలెననిన్నీ నాముఖ్యోద్దేశం టోర్వాల్డు! లోకులు నువ్వుచెప్పినట్టే చెప్తారనిన్నీ, పుస్తకాల్లోగూడా అలాగే ఉందనిన్నీ గూడా నాకు తెలుసును. కాని నామట్టుకు నే నాలోచించుకొని దాన్నంతా తెలుసుకోవాలి.

హెల్మ—ఇంట్లో నీస్థానమేదో నువ్వు తెలుసుకోవా? ఇటువంటి విషయాల్లో నీకు తగిన మార్గదర్శి లేదా ? నీ కేమీ మతము లేదా ?

నోరా—టోర్వాల్డు! నాకు మతమంటే యేమిటో సరిగా తెలియదు.

హెల్మ—ఏమిటంటావు ?

నోరా—నేను నిశ్చయం తెలుసుకోవాలంటే, పూజారులేమిటి చెప్తారో దానికంటే హెచ్చు తెలియదు. వాళ్లు మతమంటే 'ఇది, అది' అని ఇంకేమిటో చెప్తారు. ఇక్కడనుండి వెళ్లిపోయి నే నొక్కర్తనే వున్నప్పుడు ఆసంగతికూడా ఆలోచి

స్తాను. పూజారులు చెప్పింది నిజమో అబద్ధమో చూస్తాను. ఒకవేళ నిజమైతే నావిషయంలో వర్తిస్తాయో లేదో.

హెల్మ—నీలాంటి బాలికనోటినుండి యిటువంటిసంగతులెప్పుడూ వినలేను. నీకు మతం తిన్నగా తెలియక సరియైన దారిలో వెళ్లలేకపోతే నన్నైనా ప్రబోధించనీ. నీకు నైతిక జ్ఞాన ముందనుకుంటాను. లేకపోతే- జబాబుచెప్పు- లేదనుకోమన్నావా ?

నోరా—టోర్వాల్డు! జబాబు చెప్పడానికదంత తేలికైన ప్రశ్నకాదు. నిజంగా నాకు తెలియనే తెలియదు. ఆసమస్యే నన్నాందోళన పెట్టేస్తున్నాది. నాకిదిమాత్రం తెలుసును. దాన్నే మన మిరువురము రెండు భిన్నపరిస్థితులనుండి చూస్తున్నాము. ఇప్పుడు నాకు తెలుస్తున్నాది. నేననుకున్న కంటె పద్ధతులు భిన్నమైనవని. కాని నాకు మాత్రం పద్ధతులెంత మాత్రము సవ్యమని తోచలేదు. వానిప్రకారం కాంత జరాపీడితుడై మరణావస్థలోనున్నతనతండ్రిమనస్సునకు శాంతిగూర్చకూడదు. ప్రాణాపాయస్థితిలోనున్న తనభర్తప్రాణమును రక్షించగూడదు. ఇట్టి శాసనములందు నాకెంతమాత్రం నమ్మకము లేదు.

హెల్మరు—నువ్వు పసిబిడ్డలాగ మాట్లాడుతున్నావు. మనం ఉండేప్రపంచంయొక్క స్థితిగతులు నీకేమీ బోధపడలేదు.

నోరా—లేదు. నాకు బోధపడలేదు. నేను బోధపర్చుకోడానికి ప్రయత్నంగూడా చెయ్యను. ఈప్రపంచకమా, నేనా య్యెవరు సరియైన మార్గములో పోవుచున్నది ? వీలైతే నేను కనుక్కుంటాను.

హెల్మరు—నోరా ! నువ్వు జబ్బుగానున్నావు. నీకు సన్నిపాతం చేసింది. నీకు మతి తప్పిపోయిందనుకుంటాను.

నోరా—ఈరాత్రివున్నంత నిర్మలంగాను, స్థిమితంగాను, నామనస్సు ఎప్పుడూ లేదు.

హెల్మరు—అయితే నువ్వు స్థిమితమైనమనస్సుతో నేనా, నీభర్తను పిల్లలను విడిచిపెట్టేస్తున్నావు.

నోరా—అవును.

హెల్మరు—అయితే యీ ఒక్కదానికి సమాధానం చెప్పు.

నోరా—ఏమిటది ?

హెల్మరు—అయితే నువ్వు మరినన్ను ప్రేమించడం లేదు ?

నోరా—లేదు. అదేకారణం.

హెల్మరు—నోరా ! నీకామాట చెప్పడానికి ధైర్యముందీ ?

నోరా—టోర్వాల్డు! ఆమాట చెప్పడం నాకు చాల కష్టంగానేవుంది. నువ్వు నన్నెంతో దయతో చూస్తూవుండే

వాడివి. కాని చెప్పక తప్పిందికాదు. నిన్నెంతమాత్రమును ప్రేమించడంలేను.

హెల్మరు—(తిరిగి శాంతినిపొంది) అదికూడ నిర్మలమై స్థిమితమైన ఒప్పుదలేనా ?

నోరా—అతిస్థిమితమైన మనస్సుతో మనస్ఫూర్తిగా చేసిన ఒప్పుదల. ఆకారణంచేతనే యిక్కడ నేను మనుండను.

హెల్మరు—నాయందలి నీప్రేమభంగం కాడానికి నేనేం జేశానో నువ్వు చెప్పగలవా ?

నోరా—ఆఁ. చెప్పగలను. ఈరాత్రి ఆవిపరీతమైన కార్యం జరిగినప్పుడే అప్పుడు నే ననుకున్నమనిషివి నువ్వుకావని తెలిసింది.

హెల్మరు—విపులంగా చక్కాచెప్పు. నాకేంబోధపడ లేదు!

నోరా—నేను ఓర్పుతో ఎనిమిదిసంవత్సరాలు గడిపాను. భగవంతునికే తెలుసును. నే నెలాగు ప్రతిక్షణం యీవిపరీతం జరుగుతుందని భయంతో నిరీక్షించానో; కట్టకడపటికి నే డీభయంకరదురవస్థ వచ్చింది. ఇకతప్పకుండా వుపద్రంజరిగినట్టే అనుకున్నాను. క్రోగ్‌స్టాడ్ వ్రాసిన వుత్తరం అందులోనున్నప్పుడు వాడుకోరిన షరతులకేమాత్రం నువ్వు ఒప్పుకుంటావనుకోలేదు. వాడిని 'నీయిష్టంవచ్చినట్టు చెయ్యి, లోకంలో చాటితే

చాటు' అని అంటావని నేను పూర్తిగా నమ్ముకున్నాను. వాడు దాన్ని లోకంలో ప్రకటించిన తరువాత——

హెల్మరు——ఆతరువాత ?- నాభార్యను అవమానానికి పరాభవానికి పాలుచేసినతరువాత——

నోరా——ఆతరువాత నువ్వు ముందుకువచ్చి భారమంతా నీమీద వేసుకుని 'ఈతప్పంతానాది' అని అంటావనుకున్నాను.

హెల్మరు——నోరా-!

నోరా——నీవల్ల నట్టిత్యాగాన్ని ఆసిస్తానని నువ్వనుకోలేదు. నేనుగూడ యెంతమాత్రం ఆసించలేదు. కాని నాబప్పుదలవల్ల నీకేంలాభం ? ఆవిపరీతం జరుగుతుందని నేను తలచి భయపడ్డాను. అట్టిది జరుగకుండా వుండాలనే నేను ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను.

హెల్మరు——నేను సంతోషంతో రాత్రీపగలు కష్టపడి. నోరా !- వచ్చే కష్టసుఖాలను భరిస్తాను. కాని ప్రపంచకంలో ఎవరును తాను ప్రేమించినదానిగూర్చి తనగౌరవాన్ని భంగం చేసుకోరు.

నోరా——అలాగు లక్షలకొలదీ స్త్రీలు చేస్తారు.

హెల్మరు——నువ్వు ఏమీతెలియని పిల్లలాగు యోజిస్తూ మాట్లాడతావు.

నోరా—కావచ్చును. కాని నువ్వుమాత్రం నే ననుసరిం చడానికి తగిన పురుషునిలాగ ఆలోచించడం లేదు. మాట్లాడడం లేదు. నీభయం తీరిపోయినతరువాత- ఆభయం నాకేమో వుపద్రంవస్తుందనికాదు, నీకేమో వుపద్రం వస్తుందని-అంతా గతిం చినతరవాత నీవిషయంలో అదంతాజరగనట్టే. అప్పటినుండీ నేను నీపూర్వపుభరతపక్షిని, నీసాలభంజికను అతిష్టాను విరిగిపోకుండా బద్దలైపోకుండా ఇంకనుండి పూర్వంకంటే రెట్టిం చిన జాగ్రత్తతో చూస్తావు. (లేచి) టార్వాల్డు! ఈయెనిమిది సంవత్సరాలై పరాయిమనిషితోనుండి, అతనికి ముగ్గురు పిల్లల ను కన్నానని యిప్పుడు నాకు తట్టింది- అయ్యో! అదితలచు కుంటే నేను భరించలేను. నామట్టుకు నేను ముక్కముక్కలుగా కోసేసుకోవాలనుంది.

హెల్మరు—(విచారముతో) అలాగా! మనయిద్దరికీ మధ్యనొక అఖాతము బయలుపడ్డాది. కాదంటే లాభంలేదు. కాని నోరా! అదిపూడ్చడానికి వీలులేదా?

నోరా—ఇప్పటి పరిస్థితులనుబట్టి నీకు నేను భార్యను కాను.

హెల్మరు—నే నిప్పుడు పూర్వపు మనిషినికాను.

నోరా— నీ బొమ్మ నీదగ్గరనుండి తీసేస్తే నువ్వు పూ ర్వపుమనిషివి కావేమో!

హెల్మరు—వెళ్లిపోడమా? - నావద్దనుండా? వద్దు వద్దు నోరా! అదిమెంతమాత్రం నాకిష్టంలేదు.

నోరా—(కుడివైపునుండి వెలుపలికిపోవును.) నీకిష్టం లేకపోవడంచేతనే నేను తప్పకుండా వెళ్లిపోవాలి. (ఆమెవస్తులను టోపీ, చిన్నసంచీ తీసుకొనివచ్చి మేజాప్రక్కనున్న కుర్చీ మీాదపెట్టును.)

హెల్మరు—నోరా! నోరా! ఇప్పుడు వెళ్ళవద్దు! రేపటి దాకవుండు.

నోరా—(వస్తులనుధరిస్తూ) పరాయిమనిషియింట్లో నే నొకరాత్రి గడపలేను.

హెల్మరు—కాని మనం సోదరీసోదరులలాగ ఉండడానికి వీలులేదా? -

నోరా—(తనటోపీ పెట్టుకుంటూ) ఆయవస్థ చాలకాలముండదని నీకుతెలుసును. (శాలూకప్పుకొనును.) వెళతాను. టోర్వాల్డు! నేను పిల్లలనుచూడను. నాకంటే మంచిదానివద్దనే వారు పెరుగుతున్నారు. ఇప్పటిస్థితిలో వారికి నే నేమి ఉపయోగంకాలేను.

హెల్మరు—కాని మరెప్పుడైనా- నోరా! - మరెప్పుడైనా?

నోరా—ఆసంగతి నే నెలాగుచెప్పగలను? నే నేమవుతానో నాకేతెలియదు.

హెల్మరు—ఏమైనా నువ్వు నాభార్యవు కావా?

నోరా—టోర్వాల్డు! నామాటవిను! ఇప్పుడు నేను వెళ్లిపోతున్నట్టుగా భార్యఎవరైనా తనభర్త యిల్లు విడిచి వెళ్లిపోయినప్పుడు, ఆమెపూచీయేమి అతనికి లేదనివిన్నాను. ఏదెలాగైనా నావిషయంలో నాపూచీ నీకేమీలేదు. నాకంటేనావిషయంలో నువ్వేమి బాధ్యతవహించనక్కరలేదు. మనయిరువురకు సంపూర్ణస్వాతంత్ర్యముండాలి. ఇదిగో నీవుంగరం. నావుంగరం నాకిచ్చి.

హెల్మరు—అదికూడానా?

నోరా—అవునదికూడాను.

హెల్మరు—ఇదిగో తీసుకో.

నోరా—సరే. అంతాఅయిపోయింది. ఇవిగో తాళాలు. ఇంట్లో వస్తువులెక్కడున్నాయో దాసీలకు తెలుసును. నాకంటేకూడా బాగాను. రేపు ఆమెయింటినుండి వెళ్లిపోయినతరువాత క్రిస్టైనువచ్చి నే నింటినుండి తెచ్చినసామానంతా మూటలు కడుతుంది. అవి వెనకనుండి పంపించి.

హెల్మరు—అంతాఅయిపోయింది! అంతా అయిపోయింది - నోరా నన్నుగూర్చి నువ్వెప్పుడూ తలచుకోవా ?

నోరా—నీగురించి, పిల్లలనుగురించి, యీయింటినిగురించీ తరుచు తలచుకుంటునే వుంటాను.

హెల్మరు—నీపేరను త్తరాలు వ్రాదునా?

నోరా—వద్దు. వద్దు. నువ్వు వ్రాయవద్దు.

హెల్మరు—పోనీ నీకేమైనా పంపించనీ -

నోరా—ఏమీావద్దు. ఏమీావద్దు.

హెల్మరు—నీకవసరమైతే సహాయం చేస్తాను.

నోరా—వద్దు. పరపురుషునివద్ద నేనేమీాతీసుకోను.

హెల్మరు—నోరా! నేను పరపురుషునికంటే యేమి హెచ్చుకాదా?

నోరా—(తనసంచీపట్టుకొని) అమ్యో! టోర్వాల్డు! ప్రపంచకంలో అన్నిటికంటే అద్భుతమైనసంగతి జరగబోతున్నాది.

హెల్మరు—అదేమిటోచెప్పు?

నోరా—మనమిద్దరం యిలాగు మారిపోయి- అమ్యో టోర్వాల్డు! అద్భుతకార్యాలు జరుగుతాయంటే యిక నాకు నమ్మకంలేదు.

హెల్మరు—కాని నేను నమ్ముతాను. చెప్పనా? ఇలా గుమారిపోయి—

నోరా—మనజీవితం నిజమైన వివాహంగా మారుతుందని (ఆమె సావడిగుండా వెళ్ళిపోవును.)

హెల్మరు— (ద్వారమువద్దనున్న కుర్చీలో కూలబడి చేతులతో తనముఖమును కప్పుకొనును.) నోరా! నోరా! (నే లువంకలచూచి లేచును. ఉత్తదే ఆమె వెళ్లిపోయింది. (అతని హృదయమందు ఆశ మెరుపువలె మెరయును!) అన్నిటికన్నా అద్భుతమైనసంగతి?

(క్రిందనుండి తలుపుమూసిన ధ్వనివినబడును.)

సంపూర్ణము.

